# చరిత్రలు - కథలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాత్మా గాంధి | 0 | 8 | పట్టాభి | 0 | 8 |
| జవహర్లాలు నెహ్రూ | 0 | 8 | జాతీయగీతములు | 0 | 6 |
| హిట్లర్ దురంతములు | 0 | 8 | కాంగ్రెస్ విజయం (బుర్రకథ) | 0 | 4 |
| సుభాష్‌చంద్రబోస్ | 0 | 8 | కొల్లేరు రైతు డిటో | 0 | 4 |
| చిత్తరంజన్ దాసు | 0 | 8 | జమీన్ రైతు డిటో | 0 | 4 |
| బాబూ రాజేంద్రప్రసాద్ | 0 | 8 | నేతాజీ డిటో | 0 | 8 |
| అచ్యుతపట్వర్థన్ | 0 | 8 | జయప్రకాశ్ డిటో | 0 | 8 |
| జాతీయనాయకులు 1 వ భా॥ | 1 | 0 | సుభాష్‌చంద్రబోస్ (200 పేజీలు) | 1 | [illegible] |
| డిటో 2 వ భా॥ | 1 | 0 | పరారి నేతాజీ | 1 | 0 |
| రాజగోపాలాచారి | 0 | 8 | శ్రీనాథకవి చరిత్ర | 0 | 12 |
| జైహింద్ (చక్కని పద్యములు) | 0 | 4 | వేములవాడ భీమకవి | 0 | 12 |
| మదనమోహనమాలవ్యా | 0 | 8 | తెనాలి రామకృష్ణ | 0 | 12 |
| రవీంద్రనాథ టాగూర్ | 0 | 8 | బమ్మెర పోతరాజు | 0 | 12 |
| అబుల్ కలామ్ ఆజాద్ | 0 | 8 | శ్రీకృష్ణదేవరాయల చరిత్ర | 0 | 12 |
| నెహ్రూ-ఇందిరకు వ్రాసిన లేఖలు | 1 | 0 | నలమహారాజు కథలు (వచనం) | 0 | 12 |
| జనాబ్ జిన్నా | 0 | 8 | పంచపాండవుల అజ్ఞాతవాసము | | |
| కస్తూరిభాయి గాంధి | 0 | 8 | (పెద్దది బైండు) | 1 | 8 |
| ఆజాద్ హింద్ ఫౌజు | 1 | 0 | శ్రీరామ వనవాసం | 1 | 0 |
| జైహింద్ (వచనం) | 0 | 8 | పరమానంద శిష్యుల కథలు | 0 | 6 |
| స్వామి వివేకానంద | 0 | 12 | భోజకాళిదాసు కథలు | 0 | 12 |
| ఆచార్య కృపలాని | 0 | 8 | భట్టివిక్రమార్కుని కథలు | 1 | 0 |
| భూలాభాయ్ దేశాయి | 0 | 8 | డిటో (చిన్న సైజు) | 0 | 12 |
| సర్దార్ వల్లభాయ్ పటేల్ | 0 | 8 | స్త్రీలవ్రతకథలు 1,2,3 భా॥లు | 0 | 12 |
| విజయలక్ష్మీ పండిట్ | 0 | 8 | రైతుఋణచట్టము | 0 | 2 |
| [illegible] సోదరులు | 0 | 8 | పాండవ వనవాసము | 1 | 0 |
| అరుణ అసఫాలీ | 0 | 8 | కాశీక్షేత్ర మహాత్మ్యము | 0 | 12 |
| ఛత్రపతి శివాజీ | 0 | 12 | మహాపతివ్రతల కథలు | 0 | 12 |
| పృథ్వీసింగు | 0 | 8 | మదనకామరాజు కథలు | 1 | 0 |
| ప్రకాశం | 0 | 8 | హరిశ్చంద్ర (వచనం) | 0 | 8 |
| నా జీవితయాత్ర (ప్రకాశం) | 3 | 0 | మైరావణ చరిత్ర | 0 | 2 |

# శకుంతల, బి. ఏ.,

గ్రంథకర్త:
జొన్నలగడ్డ వేంకటరాధాకృష్ణయ్యగారు

పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి
1948

# విషయసూచిక

శ్రీరస్తు

# శకుంతల, బి. ఏ.

## మొదటి ప్రకరణము



### ప్రస్తావన

'సౌందర్య మనన్యసామాన్యము. నీకు యౌవనము ప్రాప్తించినది. ఇరువది వత్సరముల వయస్సు కలదానవు. నేను స్వార్థపరుడనుగాను. నాభాగ్య మపారము. నేను జీవించినంతకాలము యీ యాస్తిని నాతోబాటు నీవనుభవింతువు. నాయనంతర మీభాగ్యము ననుభవించుటకు నీవుతక్క, యొరులెవ్వరు లేరు. నేను పెద్దవాడనను నభ్యంతర మొకటితప్ప. శకుంతలా! నన్ను పెండ్లిచేసికొనవా?'

ఈవాక్యములు రత్నలాలు నోటినుండి వెలువడినవి. అతడు చాల మెల్లగాపలికిన యాపలుకుల నాలకించిన శకుంతల వీధివంక చూచుచు బెదవి విరిచినది. తన కెదురుగా గూర్చుండియున్న రత్నలాలువంక చూచినది. ఆతనివయస్సేబదిరెండు వత్సరములు. తనకతడు నిజముగా నేమగునో తెలియదు కాని 'మామా' యని పిలుచుచుండును. గడ్డముమాసి, తల నెఱసి, చేతులు వణకుచున్న రత్నలాలా వివాహప్రస్తావన జేసినంతనే యాతనియెడ నామె కసహ్యము కలిగినది. ఆతడు మఱల నిట్లనినాడు.

'నాకు పిచ్చియెత్తి యిట్లు పలుకుచున్నానని తలపవలదు. ఎంతో కాలమునుండి యాలోచించియే నేడిట్లనుచున్నాను. శకుంతలా! ఈ వయస్సులో ఒక్కడను. హృదయమిచ్చి మాట్లాడుటకు దగినవారు లేక జీవించుట దుస్తరము. భార్యయనబడు నామెతో నేను చెప్పుకోవలసిన విషయము లెన్నోయున్నవి.

'నేను వివాహము చేసికోదలచుకోలేదు. ఎవరిని పెండ్లియాడను. నాయెడలగల ప్రేమాతిశయమున వివాహప్రస్తావన చేసినందుల కెంతయు కృతజ్ఞురాలను.

అతని గది యలమారులో మూడు ఖాళీ విస్కీసీసాల నామె చూచినది. ఆతడు విశేషముగా మద్యముసేవించి యుండెనేమో యని శకుంతల తలంచినది. 'నేను నిజము పలుకుచున్నాను. నాకు పెండ్లి యక్కరలేదు' అనిఆమె మఱలననినది. 'నేను బొంబాయిలో నికమీదట నుండజాలను. ఆరోగ్యముకొఱకు వసిమ్లాకో, డార్జిలింగునకో మఱెచ్చోటికో పోదలచినానని రత్నలాలు పలికినాడు.

'మీ పోకడనుగూర్చి డాక్టరు నవజీవలా లెఱుంగునా?'

'ఎఱుగడు. ఆతనికి దెలియరాదు నీకొక్కర్తెకే చెప్పినాను. ఇది పరమరహస్యము. శకుంతలా! నేడు వార్తాపత్రికావిశేషములేమి?

చినిగినకోటు, మాసినపంచె, ధూళిధూసరితమైనలాల్చిధరించి యున్న యాపరమలోభికి బ్యాంకులో గొన్నిలక్షలరూపాయలున్నవని యామెకు దెలియును. ఆతడు వార్తాపత్రిక నెప్పుడును చదువడు. శకుంతలయే పత్రికావార్తల నతడడిగినప్పుడెల్ల చెప్పుచుండును.

'ఏమంతముఖ్యమైనవి లేవు. ధుత్తుమందుల గ్యాంగులను గూర్చి వ్రాయబడినది'

రత్నలాలుముఖ మామాట వినినంతనే వెల్లదనము నొందినది ఆతని తొట్రుపాటును శకుంతల చూడకపోలేదు. డ్రాయరులోని పత్రికలను దీసి యామె యిట్లు చదివినది—

'నిన్నటియుదయమున ఇన్స్పెక్టరు చంద్రమోహను అర్జురు పోలీసులతో దాదరులోని యొకగృహమును సోదాచేసెను. నల్లమందు పెట్టెలుకొన్ని, 16 పౌనుల కొకెయిను దొరికినది. రెండుగ్యాంగులవారు చట్టవిరుద్ధమైన యీవ్యాపారమును బహుళముగ జేయుచున్నారని తెలియుచున్నది. ఒకగుంపునకు గొప్పజవాను వర్తకుడు సోరాబ్జా యను పేరుగలవాడు నాయకుడట. ఆతనికి బోటీగా మఱొక కంపెనీయున్నదట. దానిలో నొక గొప్పయుద్యోగియు, ఒక డాక్టరును, గొప్పవర్తకుడును ఉన్నారని తెలియుచున్నది. రంగూనులోనున్న వీరి ఏజంటు చండీదాసు అరెస్టుచేయబడినాడట.'

'అయ్యో!' అని రత్నలాలు కుర్చీలో కూలబడినాడు. శకుంతల 'ఏమి? ఏమైన?' దని ప్రశ్నింప, నాతడు 'కొంచెము విస్కీ తెమ్ము నాపడకగదిలోనున్న' దనినాడు. పాపము ఇష్టములేనిదయ్యు శకుంతల విస్కీగ్లాసులోబోసి యిచ్చినది. అదిత్రాగి యతడులేచి 'నే నాఫీసుకు బోవుచున్నాను అచ్చట కలిసికొందును. నేనిందాక చెప్పిన దానివిషయమై యోచించుము. కంపెనీ యధికారము వినాయకరావుచేతులందు బడినదాదిగ నాకు శాంతిలేదు' అనుచు నతడు వెడలిపోయినాడు. ఆమెకూడ లేచి, బస్సునెక్కి మెడ్రోసువీధిలోనున్న 'బాంబే ట్రేడింగు కార్పొరేషను' ఆఫీసునకు బోయినది. ఆకంపెనీలో నామె టైపిస్టు, రత్నలాలు మేనేజరు.

---

## రెండవ ప్రకరణము

### బాంబే ట్రేడింగు కార్పొరేషను

'బాంబే ట్రేడింగు కార్పొరేషను' అను పేరుతో డెబ్బది సంవత్సరములకు బూర్వము దయారాం అను గుజరాతీ కోటీశ్వరుడు కంపెనీపెట్టి విదేశములతో విరివిగా వర్తకముచేసెను. స్టీమరులు, విదేశవస్త్రములు, ప్రత్తి, దూదిమున్నగు వానిలో భారీగావ్యాపారముచేయు కంపెనీ యదియే యని దేశప్రఖ్యాతి గాంచిన యాకంపెనీ డెబ్బది సంవత్సరములనుండియు మెడోసువీధిలోని పురాతన సౌధముననే యున్నది. ఆకంపెనీ యజమానులు మారుచున్నకొలది వర్తకములో గూడ చాల మార్పులొదవినవి.

శకుంతల టైపురైటింగుమెషీను ముందు ఆయిలింగు, క్లీనింగు చేసినది. దీర్ఘములైన వినీలకుటిలకుంతలములు, విశాలలోచనములు బంగారము నపహరించు శరీరచ్ఛాయ ఇవి యన్నియు నామె యసాధారణ సౌందర్యవతి యని తోపింపజేయును. ఆమెవలెనే యచట గుమాస్తాగాపనిచేయు యువతి లీల. లీలకు వాదమన్న నిష్టము. ఆమె శకుంతల గదిలోనికి వచ్చి యేమేమో చెప్పుచు 'శకుంతలా! మన యజమాని వినాయకరావు స్వభావము మిక్కిలి విపరీతమైనది. అతని కోపము, విసుగుదల, తీక్షణములగు దృక్కులు నాకసహ్యము కలిగించుసుమా' యన్నది. శకుంతల యేమియు బదులు పలుకలేదు. 'ఈదుష్టునికడ నుద్యోగము సేయుటకు మీ• మామ రత్నలాలెట్లు సమ్మతించినాఁడో' అన్నది లీల.

'వినాయకరావు దుష్టుడననుగాని ఆతనిచర్య లానందదాయకములుకా' వన్నది శకుంతల.

'ఊత డెచ్చటనుండి యూడిపడినాడు. దయారాం మనుమడట. ఇన్నాళ్ళు నెచటనుండెనో తెలియదు.'

'కలకత్తాలో నేదో యుద్యోగము చేసినాడట. క్రొత్త కనుక మన కాతని చర్యలు విపరీతముగ దోచవచ్చును. గాని యజమాని కనుక మనమలవాటుపడవలెను—'

'ఏమో నిన్న మధ్యాహ్నము మీమామయు నతడును రెండు మూడు గంటలకాలము కలహించినారు.'

'శ్రీలా! రెండుమూడు గంటలా?'

'నిజముగా నంతకాలము కాదుకాని యరగంటకు దక్కువ సేపుకాదు'

శకుంతల యాలోచించినది, వినాయకరావు ఆకంపెనీ యాజమాన్యము వహించి మాసమైనగాలేదు. మేనేజరైన రత్నలాలుతో గలహింపవలసిన యగత్యమేమి?

ఇంతలో గంటమ్రోగినది. నోటుబుక్కు, పెన్సిలు తీసికొని శకుంతల యజమానిగదిలోనికిఁ బోయినది. వినాయకరావు టేబిలుకడ గూర్చుండి వ్రాసుకొనుచున్నాడు. ఆతడు వ్రాత ముగించి, 'ఆఁ' అనినాడు. ఆతని ముఖ మెప్పుడును క్రోధమును సూచించుచుండును తాను వచ్చి మూడునిమిషములకు పైగానైనను నతడు మాట్లాడక పోవుటచే నామె యొకింత కోపము, విసుగుజెంది, 'బిల్లులన్నియు టైపుచేసినాను. ఈ ఉత్తరములపై సంతకము చేయు,' డనినది. ఆతడా లేఖలను దీసికొని, చూచి, బల్లపైనున్న తొట్టిలోనిడినాడు. ఆతడు తలవంచుకొనియే మాటలాడుచుండును. అది శకుంతల కయి

ష్టము. వినాయకరావు తలవంచుకొనియే 'శకుంతలా! నన్నుచూచిన నీకు భయమా?' అనినాడు—

అతని నోటినుండి యట్టిప్రశ్న వెలువడునని యూహించనందున నామె నివ్వెఱవోయి 'నాకు మీరనిన భయములేదు. ఎవ్వరనినను భయములేదు' అనినది.

ఆమె మరల 'చెప్పు చేయవలసిన యుత్తరములేమియు లేవా?' అనినది.

'లేవు ఈయుత్తరము గ్రాంట్ రోడ్డులో 769 నెం॥ సౌధమున నున్న టాంగ్ బియాన్ సిన్‌చాంగు' అను చీనాదేశస్థున కిచ్చిరమ్ము. నీకంటె యచ్చటకుఁ బంపదగిన విశ్వాసపాత్రులు లేరు. శకుంతలా! మాతాతగారి నెఱుగుదువా?'

'కొంచెముగా నెఱుగుదును. నే నీకంపెనీలో జేరిన నాల్గు మాసములకే యాయన కాలధర్మమొందినారు.'

'నీమేనమామయే వ్యాపారము చేయుచుండెననినాయుద్దేశము'

'అవును. దయారాంగారు ఆఫీసులో నరగంటకంటె విశేష కాల ముండెడివారు కారు.'

'అందుచేత నే కంపెనీ యింతచిక్కని పరిస్థితులలో నున్నది. సరే నీవు వెళ్ళిపోవచ్చును.'

శకుంతల వెడలిపోబోవునంతలో నతడు 'అయితే ఇండియన్ ట్రేడింగుకంపెనీవారు నీకెంతజీతమిచ్చెదరు' అని ప్రశ్నించినాడు.

ఆమె యాశ్చర్యమునొంది 'ఇండియన్ ట్రేడింగుకంపెనీ విష యమే నాకుదెలియదు' అన్నది.

'అయ్యో! ఆకంపెనీవిషయము తప్పక తెలిసికోదగినది. చాలాగొప్పకంపెనీ.'

శకుంతల తన గదిలోనికి వెడలిపోయినది.

---

# మూఁడవ ప్రకరణము

“ఁవు నాయోకావా”

‘ఇండియన్ ట్రేడింగుకంపెనీయా? అది యెవరిది ? తాను రహస్యముగ మఱొక కంపెనీలోఁ బనిచేయుచుండెనని వినాయక రావనుమానించి యుండెనా? తన మామ యగు రత్నలాలు నడిగి నచో జెప్పును గాని యాతని నామె యడుగఁ దలఁచుకొనలేదు’

శకుంతల యిట్లు తలఁచుకొనుచుండగా రత్నలాలు గదిలో బ్రవేశించి ‘వినాయకరాఁవేడీ’ యనినాడు.

‘గదిలో నున్నాడు’

‘అతఁడు దేనినిఁ గూర్చియైన ప్రసంగించెనా?’

‘లేదు’

‘నేనిందాక చెప్పినదాని విషయమాలోచించినావా?’

‘లేదు ఆలోచించ దలఁచుకొనలేదు.’

‘అవును. నేను వయోవృద్ధుఁడ నని సంశయించినావు కాఁబోలును’ అని రత్నలాలు వినాయకరావు గదిలోనికి వెళ్ళినాఁడు. ఆతడు కూర్చుండి ‘నిన్న నేను మీతో ననవసరముగా కలహించినందులకు క్షమింపఁ గోరెదను.’ అనినాడు

‘రత్నలాల్ ! నే నీకంపెనీ విషయములకు కేవల మపరిచితుఁడను. నే నిచ్చటికి ఎనిమిది నెలలకుఁ బూర్వమే రావలసియున్నను మొన్న మొన్నటిదాక వచ్చుటకు వీలిచ్చినది కాదు. బొంబే ట్రేడింగు కార్పొరేషను సుప్రసిద్ధమైనదని, సులభముగా యాజమా

న్యము నిర్వహించ దగునని తలంచితిని గాని కార్పొరేషను నాకు వ్యతిరేకులగు వైరుల హస్తగతమైయుండుననీ, ఆ వైరుల నణచుటకు నేను పోరాడవలసి యుండుననీ యూహింపనైతిని.''

'పోరాటమా?' అని రత్నలాలు ఆశ్చర్యముగ ననినాడు.

'ఇండియన్ ట్రేడింగుకంపెనీ యెవరిది?'

ఆప్రశ్న రత్నలాలున కశనిపాతమువలెఁ దోచినది. ఆతఁడు బదులుపలుకలేదు. వినాయక రావిట్లనినాఁడు—'ఇండియన్ ట్రేడింగు కంపెనీ చక్లావీధిలో 158 నెం॥ సౌధమున నున్నది. ఆమేడలో నొక్క గదిలో మాత్రమే ఆకంపెనీ పనిచేయుచున్నది. గుమాస్తాలెవ్వరును లేరు. పగలు ఆ ఆఫీసు పనిచేయదు. చుట్టుప్రక్కలనున్న దుకాణము లన్నియు గట్టివేసిన పిదప నొకవ్యక్తి రహస్యముగ వచ్చి రాత్రి 12 గంటలవఱకుఁ బనిచేయును. ఆతఁడు లేఖలను టైపుచేయును. కాపీలుంచుకొనఁడు. అపాత్రులగు దురాత్ములను గలసికొనుచుండును. తరతరములనుండి నమ్మకమునకుఁ బ్రసిద్ధిచెందిన బొంబే ట్రేడింగు కార్పొరేషను చట్టవిరుద్ధమైన మత్తుమందుల నెగుమతి చేయుచున్న విషయము నాకుఁ జాల విచారము గల్గించుచున్నది.'

'అట్లయిన నేను నాయుద్యోగమునకు రాజీనామా యిచ్చి వెడలిపోయెదను. 35 సం॥రములనుంచి విశ్వాసముతోఁ గంపెనీని గొల్చుచున్నాను. మత్తుమందు వ్యాపారమా? ఏమది? ఇండియన్ ట్రేడింగు కంపెనీని నేనెఱుగుదును. అదికూడ చాల ప్రసిద్ధమైన కంపెనీ.''

'రత్నలాలు! తుదవఱకు నీవబద్ధమాడుదువు నీయాటలింక సాగి రావు. నేను నిష్కర్షగా జెప్పుచున్నాను. నీవు నామార్గమును నిరోధించుచున్నావు. నీయడ్డంకి తొలగించుకొనుటలో నిన్ను చంపవలసిన యవసరము వచ్చినను వెనుదీయను. ధనార్జన ముఖ్యము. రెండుకంపెనీ

లోనికే వ్యాపారము చేయజాలవు వినుచున్నావా? రెండింటికి యానగరమున స్థానములేదు. సోమోకారం పెనీకి పోటీయుండరాదు తెలిసినదా?'

రత్నలాలు బదులు చెప్పలేదు.

శకుంతలకుఁగూడ దానితో సంబంధమున్నదా?'

'లేదు. అట్లయిన నీవు సోమోకా...వా? నేను కలనైన తలపలేదు.'

'ఇఁక నీవు వెళ్ళవచ్చునని తెలపంకించగా రత్నలాలు లేచి, వెడలి పోయినాడు. ఎంతో చీకాకును బ్రకటించిన యాతని ముఖము చూచి శకుంతల యోచనానిమగ్నయైనది.

— · —

## నాలుగవ ప్రకరణము



### డాక్టరు నవజీవన్ మెహతా

ఎంతకాలమునుండి యట్లుజరుగుచున్నదో తెలియదు. బొంబే ట్రేడింగు కార్పొరేషనులో బనిచేయు యుద్యోగులకు కాఫీ త్రాగుటకు మధ్యాహ్నము రెండుగంటలనుండి గంట పదునైదునిమిషముల కాలము విరామముగా నీయబడుచుండెను. ఆనాఁటి విరామకాలములో శకుంతల తనకు జిరపరిచితుఁడగు డాక్టరు నవజీవన్ మెహతాను గలిసికొన నిశ్చయించినది. మెడోసువీధికి రెండువీధులావలయున్న ప్రిన్సెసు వీధిలో నొకమేడలో నాతఁడు నివసించుచున్నాడు. ఆమె చకచక నడిచి, యా సౌధమును జేరి తలుపుతట్టినది. నౌకరు తలుపు తెఱచినంతనే యామె లోన ప్రవేశించినది. శకుంతలా! రమ్ము. కూర్చుండుమని "బోయిని" పిలిచి కాఫీ గొనిరమ్మనినాఁడు. తనహృదయములో

బి. యస్. సి., ఇది నాకెంపు పక్షి. చక్కనిపాటలను బాడును. లిజ్జి! పాటపాడు' మనినాడు. ఆపక్షి వెంటనే యవ్యక్తమనోహర ముగా పాడినది.

'కాఫీ త్రాగి వినాయకరావు జీ యిపుడే తనగదిలోనికి వెళ్ళినాడు. కుర్చీలో గూర్చుండినాడు.'

ఫెంగ్ హో చెప్పినది నిజమోకాదోయని ఆమె యజమాని గదితలుపు త్రోసి చూచినది. వినాయకరావు కుర్చీలో గూర్చుండి నాడు. ఆమెసిగ్గుపడి వెనుకకు తగ్గునంతలో నతడు లోనికిరమ్మని పిలిచినాడు.

'శకుంతలా! ఫెంగ్ హోను కలిసికొన్నావా? శబ్దమునుబట్టి యతడేమి జరుగుచున్నదో చెప్పగలడు.'

'చూచినాను'

'అతడు చీనాదేశస్థుడు. అయినను నీకంటె నాకంటెకూడ బాగుగా నింగ్లీషు మాటలాడగలడు. చీనాదేశస్థులు సదయహృదయులైనను వారిని మనదేశస్థులు గౌరవింపరు. సోయోకా జపాను దేశస్థుడు. కోటీశ్వరుడు ఎక్కువగా జీతములనిచ్చును. శకుంతలా! అతనిఆఫీసులో టైపిస్టుగా బనిచేయరాదా?'

'నాకర్థమగుటలేదు. మీఆఫీసులో నేను పనిచేయుట కిష్టము లేనియెడల చెప్పుడు, వెడలిపోయెదనుజపానువానికొలువునాకయిష్టము.

శకుంతలను జూచి వినాయకరావు నవ్వినాడు. ఆతడు నవ్వుచుండగా జూచుట కిదియే తొలిసారియగుట యామె యాశ్చర్యము నకు మేరలేకుండెను.

'ఫెంగ్ హోకడ ఎన్నోపక్షులున్నవి. అవి చక్కగా పాడును. నీకొక పక్షినిమ్మని యడుగుము. అనుదినము సాయంకాలము తప్పక షికారు తీసికొని వెళ్ళుచుండవలయునుసుమా' అని వినాయకరావు తల పంకించినాడు. శకుంతల తనగదిలోనికి వెడలిపోయినది. వినాయక

రావునుగూర్చి యామె హృదయ మొకింత కళవళపాటు నొందక పోలేదు.

---

## ఆ ఱ వ ప్ర క ర ణ ము

### భర్తయాజ్ఞ

కొలాబాలో నున్న మనోరమాదేవి సౌధ మత్యంత మనోహరముగ నలంకరింపబడియుండును ప్రిన్సెసు వీధిలోని డాక్టరు నవజీవన మెహతాకు భార్యయయ్యును యిరువురును గలిసి యుండుట లేదు. అట్లని యాదంపతులకు వైరమును లేదు. తలిదండ్రులిచ్చిన ధనమే సుమారిరువది వేల రూప్యము లామెకడ నున్నవి. ఆమె స్వేచ్ఛావిహారిణి. అది యాతనికి గిట్టదు. ఆమెకు అపార భాగ్యమున్నను దొంగతనములు చేయుట ప్రీతి. ఆమెకొఱకు తన గౌరవము కాపాడుకొఱకును నవజీవన మెహతా యొకసారి మూడువేల రూపాయలు వ్యయపఱచవలసి వచ్చెను. నవజీవన మెహతా కారునుండి దిగి యామె మేడలోనికి బోయినాడు. ఇరువురు కొంతసేపు కూర్చుండిన పిదప నామె 'మీ వైద్య వృత్తిలో నేగాణియైనను సంపాదన లేదు గదా! ఈ కారులేమి? ఈ సిల్కు సూట్లేమి? ఈ ఖర్చులకు మీరు ధనమెట్లు సంపాదించుచున్నారు?' అని యడిగినది.

'నా సంపాదన కేమి? కాని నిన్ను కొన్ని ప్రశ్నలడుగదలచి యున్నాను. జవాబు సరిగా చెప్పుము. నీవు సంవత్సరమునకు పూర్వము హిందూదేశములోని ప్రతినగరము చూచియున్నావు కదా! కలకత్తాలో నాలుగుమాసము లున్నావుకదా వినాయకరావు అను

వానితో బరిచయమైనదని యొకసారి చెప్పినట్లు జ్ఞాపకమున్నది. అది నిజమేనా ?'

'ఆ! జ్ఞప్తియందున్నది. ఆత డప్పుడేదో యుద్యోగము చేయుచుండెడివాడు. సి. ఐ. డి. సర్వీసులో బనిచేసినాడని జ్ఞాపకము ఇప్పుడేమి ?'

'ఆతనితో బరిచయము వృద్ధిచేయుము. నాకు గొంచెము పనియున్నది.'

'నాకారు పాడైపోయినది.'

'నాకారు పంపెదనులే రత్నలాలు మేనకోడలని పిలువబడుచున్న శకుంతలను బెండ్లిచేసికోదలచుకొన్నాడట ఆమెను నీసాధము నకు గొనిరమ్ము వినాయకరావు ఆఫీసులోనే ఆమె టైపిస్టుగా బని చేయుచున్నది. నీవు నాకు వదినె వగుదువని చెప్పుము. ఆ వినాయక రావును కూడ కలిసికొని మాట్లాడిరమ్ము.'

'సరే' నని పలికి మనోరమాదేవి నవ్వినది. డాక్టరు ఆమెను జేరదీసికొని 'మనూ! నేను చెప్పినట్లు తప్పక చేయుచుండుము' అని చెక్కిలిపై ముద్దుకొనినాడు

---

## ఏ డ వ ప్ర క ర ణ ము

---

### పరిచయము

శకుంతల డైరీ వ్రాసికొనుచుండగా తలుపు నెవరో తట్టినారు, 'లోనికి రావచ్చు' నని శకుంతల పలికినంతనే మనోరమాదేవి లోనికి వచ్చినది. ఆమె యొక కుర్చీలో గూర్చుండినది. 'అమ్మాయీ! నీవు నన్నెఱుంగవు. నిన్నుగూర్చి డాక్టరు నవజీవన్ మెహతా నాతో చెప్పినాడు. ఆతడు నాప్తుఁడు. అయితే వినాయకరావు యాజమాన్యము

నీకు సహింప దగినదిగానేయున్నదా? ఆతడు కలకత్తాలో నున్నవుడు నేనెఱుగుదును. ఆఫీసులో నిపుడున్నాడా?' అని యామె ప్రశ్నించినది

'ఉన్నారు.'

'శకుంతలా! నాసౌధమును జూచుటకొకసారి రావా? నాలు గైదుదినములు నాతోనుండవా?'

'వచ్చెదను లేపే వచ్చెదనని నిర్ధారణగా చెప్పలేను. నా రాకను గూర్చి ముందు నిర్ణయింపవలదు'

'అట్లన వీలులేదు. నేను వచ్చినానని మీయజమాని వినాయకరావుతో జెప్పుము.'

శకుంతల వెళ్ళి, వినాయకరావుతో మనోరమాదేవి రాకను గూర్చి చెప్పినది ఆమెను లోనికి బంపుమని యతడు చెప్పినాడు. మనోరమాదేవి వెళ్ళి 'ఓహో! మిష్టర్! జ్ఞప్తియందున్నానా?' యని యడిగినది.

'క్షూర్చుండుము చాలరోజులకు నీ దర్శనము'

'వెనుక మనము కలకత్తాలో శాంతోషు జమీందారు సౌధమున విందు సందర్భమున గలిసికొన్నారము అప్పుడే మఱచి యుందువా?'

'లేదుగాని యప్పుడే జమీందారుభార్య కంఠహారము, వజ్రములు పోదిగినది. పదివేల రూపాయలు ఖరీదుగలది యపహరింపబడినది. ఆనేరము నౌకరుపై నారోపించబడినది. మూడువత్సరములు కారాగారావాసశిక్షవిధింపబడినది. మఱునాడు ఎంపైరుథియేటరులో నిన్ను చూచినాను. ఆ హారము నీకంఠమున నున్నది?'

'హారమా! వినాయకరావు? ఏమిది?'

'ఏమియును లేదుగాని నిన్నిచ్చుటకి డాక్టరు నవజీవన్ మొహాతా పంపించి యున్నాడా'

'నవజీవన్ మెహాతా యెవరు?'

'నీ భర్త—'

'కాదు. అతడు నామఆది. నాభర్త లేడు.'

'ఎప్పటినుండి మధ్యాహ్నము నీయింటికివచ్చి వెడలిపోయిన తరువాత చనిపోయినాడా? పోనీలే. దానికేమి?'

'ఇదియేమి వినాయకరావు నీవు స్నేహితుడవని మాట్లాడుటకు వచ్చినాను. నన్నిట్లవమానింప సాహసింతువా?'

'సాహసమని నిష్ఠూరముగా మాటాడకుము! నీభర్తతో చెప్పుము. అతడు మత్తుమందులగు నల్లమందు, కొకెయిను మున్నగు నవి యెగుమతి దిగుమతులు చేయువ్యాపారములో నున్నాడు. అతనిని నామార్గమునుండి తొలగింతును. చెప్పుము. అతనిరక్తము త్రాగుటకు వెనుదీయమని చెప్పుము. నీకుఁ దెలియనే తెలియదా? ఇక వెళ్ళ వచ్చును.'

అతడట్లు మాట్లాడుననీ యామె తలపలేదు. హృదయము నాక్రమించుకొన్న దిగులును ముఖమున దోపనీయక, నవ్వు తెచ్చిపెట్టి కొని, యామెగదినుండి యీవలకు 'మాటిపోయినాడు.' అనుకొనుచు వచ్చి 'శకుంతలా! తప్పక వచ్చెదవుకాదా' యని వెళ్లిపోయినది. వినాయకరావు మఱొకగదిలోకూర్చుండియున్న ఫెంగ్ హొకడకరిగి 'ఇప్పుడే డాక్టరు నవజీవన్ మెహాతా భార్య మనోరమాదేవి వచ్చి వెళ్ళినది. కొలాబాలో 54 వ నెం॥ సౌధమున నున్నది. నేటిరాత్రి ఏ వేళనో వెళ్లి ఆసౌధము పూర్తిగా వెదకిరమ్ము. ముఖ్యములైన కాగితములను దీసి కొనిరమ్ము. అనవసరముగా హింసవలకు బోవలదు. వీలైనచో 'సోయోకా' పేరు నుపయోగింపుము అనినాడు—

అందుల కంగీకారసూచకముగ నతడు తల పంకించినాడు.

—

## ఎనిమిదవ ప్రకరణము

---

రెండో సాహసము

దాదరులోని రత్నలాలు సౌధమున కెదుట నొక అందమైన పార్కున్నది. ఆపార్కు వెన్నెలలో నత్యంతమనోజ్ఞముగా నున్నది. ఆమెకు సంతోషము కలిగించ లేదు. ఆమె ఆఫీసునుండి తిరిగి వచ్చుసరికి రత్నలాలు ఇంకా రాలేదు. అతఁడు తా నాలస్యముగ వత్తు ననియు భోజనము కొఱకు దనకై వేచియుండ నగత్యము లేదనియు ఫోనులో జెప్పినాడు ఆమె కొంతసేపు రేడియో సంగీతము నాకర్ణించి నది. పిదప భోజన మొనరించినది. తరువాత నొక నవల చదివినది. 9 గంటలైనతోడనే తన శయ్యాగృహమునకు బోయి నిద్రించినది. ఆమె యట్లెంతసేపు నిద్రించినదో యామెకే తెలియదు ఏదో శబ్ద మైనది. ఆమెకు మెలకువ వచ్చినది. మఱల నిశ్శబ్దము మఱల కిటికీ వద్దనేదో యలుకుడైనది. తటాలున శయ్యపైనుండి లేచి, శకుంతల కిటికీ తెఱచినది. అచటనొక బాకు నామెచూచినది. ఆబాకు పిడి మీద నేవో పాడియక్షరములు చీనాభాషలో నున్నవి.

---

## తొమ్మిదవ ప్రకరణము

---

10016

'బాకు! దీని నెవ్వరిటనుంచిరి?' అని శకుంతల యద్ధములతో నిర్మింపబడిన యాకిటికీతలుపుల బూర్తిగా దెఱచి చూచినది ఆమెకు త్రాటినిచ్చెననుండి క్రిందకు దిగుచున్న మనుజుడొకడు కాన్పించి

నాడు. ఆవెన్నెలలో నాతనిముఖము స్పష్టముగా కాన్పించినది. అతడెవరు? ఫెంగ్ హో ఆతడా మఱుక్షణముననే నిచ్చెనతో సహా మాయమైనాడు. ఆమె కేమిచేయుటకును దోచినదికాదు స్విచ్ నొక్కి దీపము వెలిగించినది. స్టౌ వెలిగించి, టీ, తయారుచేసికొని త్రాగి, శకుంతల కర్తవ్యము నాలోచింపసాగినది. ఆమె మనోవీధిలో వినాయకరావు గోచరించినాడు. అతడు బ్రూక్ వీధిలో నివసించుచున్నాడు అతని కావృత్తాంతము వెంటనే టెలిఫోనులో జెప్పుట యుక్తమని యామెకు దోచినది ఫోనుదగ్గఱకు వెళ్ళి వినాయకరావు గృహములో ఫోనునెంబరు 10016 త్రిప్పినది.

'ఎవరువారు—' అని ఆమెకు వినిపించినది.

'వినాయకరావుగారేనా'

'అవును! ఎందులకు శకుంతలా?'

'మీ మిత్రుడొకడీ యర్ధరాత్రమున దర్శన మిచ్చినాడు. ఆతడు లోనికి రాలేదు.'

'నామిత్రుడా? ఫెంగ్ హో యేనా?'

'అవును—'

'శకుంతలా! పొరపడితివి, ఫెంగ్ హోను పోలిన చీనా దేశస్థులిద్దరీనగరమున నున్నారు. వారిలో నెవరినో చూచి, పొరపడియుంటివి ఫెంగ్ హో యిపుడు నాతో నున్నాడు. అనవసరముగా భయపడినావు.

'మీకు నిద్రాభంగము కలిగించినాను. క్షమింపుడు'

'ఫర్వాలేదు రత్నలాలునకిది తెలిసినదా?'

'తెలియదు'

'సరే, పోయి నిద్రింపుము.'

'యేమి యాయాజ్ఞ!' యని రిసీవరు ఫోనుకుదగిలించు నంతలో రత్నలాలు లేచి వచ్చి 'శకూ! ఏమిటిది?' అనినాడు—

'వినాయకరావునకు టెలిఫోనులోఁ జెప్పినాను.'

'ఏమని?'

శకుంతల జరిగిన దంతయు జెప్పి, యాశాకును చూపినది. అది చూచి 'చీనావాడే వచ్చియుండునా?' అనినాఁడు—

'అవును ఫెంగ్ హో వచ్చినాడు ఆతఁడు కాడని వినాయకరా వనుచున్నాఁడు'

'శకుంతలా! అది యసత్యము ఫెంగ్ హోయే వచ్చి యుండును. అయిపోయినది—నన్నిఁక వారు తప్పక చంపెదరు. అయ్యో!'

'ఏమి? ఎవరు చంపెదరు? ఏమి జరిగినది!'

'సరే ఇప్పుడు కాదు. శకుంతలా! నీకు మఱొకప్పుడు చెప్పెదను' అని డ్రాయరునుండి రివాల్వరు తీసి 'నన్ను చంపుటకు ముందు వారిలో నొకరిద్దరిని దీనికి బలియిచ్చెద' నని యతఁడు గదిలోనికిఁ బోయి లోపల గడియ వేసికొనినాఁడు.

---

# పదియవ ప్రకరణము

## మరణశాసనము

ఉదయమున ఎనిమిది గంటలైనను నతఁడు మేల్కాంచలేదు. ఆమె భోజన మొనరించి, యాఫీసునకు వెడలిపోయినది. వినాయకరా వేమనునోయని యామె చిత్త మాందోళన మొందినది. తొమ్మిది గంటలన్నరకు వినాయకరావు గదిలోని గంట మ్రోగినది. శకుంతల నోటుబుక్కుతో వెళ్ళినది. ఏడెనిమిది ఉత్తరములు చెప్పగా నామె షార్టుహేండులో వ్రాసికొని వెడలిపోయినది. మధ్యాహ్నము రెండు గంటల కామె నౌకరు కుర్రవానిచే నాఫీసులోనికే తెప్పించు

కొనిత్రాగినది. కెంగ్ హో పంజరమును దీసికొని యామె గదిలోనికి వచ్చి 'మిస్ శకుంతలా! నాపక్షికి రాత్రి జబ్బు చేసినది ఒక్కక్షణ మైన నిద్రింపలేదు' అనినాడు—

'కెంగ్ హో! అసత్యము పలుకుచున్నావు. రాత్రి యంతయు నీవు పక్షితో నున్నావా?'

కెంగ్ హో పక్షితో 'లిల్లీ! నేను రాత్రియంతయు నీతో నుంటినేని చక్కని పాట పాడుము. నే నెచ్చటికైన వెళ్ళినచో పాడవద్దు'

అని నాడు. ఆతని వాక్యములు గ్రహించినట్లు, ఆపక్షి పాడ సాగినది. శకుంతల మృదులాధరముపై మందహాస చంద్రికలు నృత్య మొనరించినవి. కొంతసేపైన పిదప నతడు వెడలిపోయినాడు. అయిదు గంటలకు ఆఫీసునుండియామె వెడలిపోనెంచి, యీవలకు వచ్చుచుం డగా రత్నలాలు పిలిచి అమ్మాయీ! లాయరుతో నత్యవసరమైన యొక విషయమును గూర్చి సంభాషించి వచ్చినాను. నేనొక మరణ శాసనము వ్రాసి, లాయరుతో రిజష్టరు చేయించుమని చెప్పినాను అతఁడు క్రిమినలు కేసులు గెలిపించుటలో నాఱితేఱిన చేయి. ఒక ప్రత్యేక నేరమునకు రెండుసంవత్సరముల కారాగృహవాసశిక్ష విధింపఁబడును. నేరమును స్వయముగాఁ బోలీసుస్టేషనుకు బోయి యొప్పుకొన్నచో శిక్షచాల తక్కువగానుండును. నీకుఁ గూడ కొంత ధనము చెందునట్లు వీలులో వ్రాసినాను. వినాయకరావు ఉదయము నుండియు నేమి చేయుచున్నాడు?'

'ఉత్తరములు వ్రాసికొనుచున్నాడు—'

'ఆతని యుత్తరములు కొన్ని చూచుట ముఖ్యము. కాపీఫైలు నెచట నుంచుదువు?'

'ఆతని యినుప మందసములోనే యుంచుకొనును.'

'శకుంతలా ? కార్బను పేపరుతో మరొక కాపీ తీయలేవా ?'

'అట్టిద్రోహమును చేయను. అంతకంటె యీకంపెనీలో మాని మరొకచో నుద్యోగము చూచుకొందును.'

'ఆత డనిన యిష్టమా ?'

'అయిష్టము. అసహ్యము. అట్టిపనులు మాత్రము నాకంఠమున ప్రాణము లుండగా చేయను' అని శకుంతల వెడలిపోయినది.

---

## పదునొకండవ ప్రకరణము

### రహస్యసమాలోచనము

'ఇంద్రభవను' బొంబాయినగరములో ప్రసిద్ధిచెందిన రెస్టారెంటు. అచ్చట నెలకొకసారి డాక్టరు నవజీవన్ మెహతా స్నేహితులకు టీపార్టి యిచ్చును. వారికై ప్రత్యేక మొకగది ఆనాడు హోటలుయజమాని ఏర్పాటుచేయును. ఇరువురు వారికి వలయుదినుబండారములు, కాఫీ, బ్రాందీలను సప్లయిచేయుదురు. కొంతసేపు నాటకములు, గానసభలు, రాజకీయములు మున్నగువానింగూర్చి చర్చించినపిదప, సప్లయిచేయు నయ్యరులబొమ్మని, వారుచేయుచున్న రహస్య వ్యాపారమునుగూర్చి సమాలోచన మొనరింతురు. ఆనాడా గదిలో నాలుగురు మధ్యవయస్కులు వాణిజ్యప్రపంచమున నారితేరినవారు కూర్చుండియున్నారు. ఫలహారానంతరము వారుబ్రాంది సేవించినారు.

డాక్టరు నవజీవన్ వారిలోనొకడగు బద్వేను నుద్దేశించి యిట్లనినాడు—

'రత్నలా లస్వస్థుడై యున్నాడు. మూడుకన్సైనుమెంట్లు వచ్చియున్నవి. ఒకటి హార్బరులోనున్నది. రెండవది కరాచిలోను;

మూడవది బ్రాంచిలోను ఉన్నవి. కష్టమ్సు ఆఫీసర్ల బాధయేమియు లేదు. బర్వే! నీవు బ్రాంచి వెళ్ళి దానినిటకు గొనిరమ్ము. సూరత్ లోనిది రంగూను పంపవలయును. హార్బరులోనిది బేరమిచ్చినాము.'

'జగన్మోహనదా సిట్లనినాడు'

'నవజీవనన్! సరే ఇన్‌స్పెక్టరు చంద్రమోహన్ మాట యేమిచేయుదము! ఆతడే కొంచెము బాధాకరముగా నున్నాడు. పది వేలు పార వేసినచో నూరకొనడా?'

'లాభములేదు. ఆతడట్టివాడుకాడు. కాని రత్నలాలు వయో వృద్ధుడగుట భయపడుచున్నాడు. అతనుమనగుట్టురట్టు చేయునేమో యని భయపడుచున్నాను. అదిగాక సోయోకా యొకడు.'

నవజీవ నిట్లనినంతనే కంజీభాయి 'సోయోకా!' అన్నంతనే గుండెలు ఝల్లుమనుచున్నవి. మనము కోటీశ్వరులము. మనల నెవరు నిట్టి చట్టవిరుద్ధమై ప్రజలను వినాశముచేయజాలిన మత్తు మందుల యెగుమతి దిగుమతి వ్యాపారములో నపార లాభము నార్జించుచున్నామని యనుమానింపజాలరు. ఈసోయోకా పోటీకి నిలుచుట దుస్సాధ్యము. అత డెవరు?' అనినాడు.

'వినాయకరావే సోయోకాయై యుండవలెను. లేదా ఆతడు సోయోకా ముఖ్యప్రతినిధియైననై యుండవలెను అని నవజీవనుపలికినాడు. బర్వేను దాను రంగూనులో నున్నప్పు డెఱుగుదు ననియు దానును నతడును ప్యారిసు క్లబ్బులో మెంబర్లుగా నుంటి మనియు, చీనావారి వ్యాపారములో దానినస్పెక్టరై యుండియు మిక్కిలి సాహాయ్యముచేసి. యపారముగ ధనార్జన మొనరించెననియు నకస్మాత్తుగ నుద్యోగమునకు సెలవుపెట్టి కలకత్తాకు పోయెననియు. నతడు బాకు నుపయోగించుటలో కడుంగడు నేర్పరియనియు, నప్పుడే సోయోకాకునాతనికి సంబంధమున్నదని తానువింటిననియు జెప్పినాడు.

'అట్లయిన యీవినాయకరావును మన కడ్డము రాకుండ తొలగించు విధానము లేదా ?

'నవజీవన్ ! మెజస్టిక్ సినీమా రోడ్డున అణాకు బదిమంది రౌడీలు దొరకుదురని విన్నాను. ఎవడికో వందరూపాయలు పారవేసి వినాయకరావునకు జావ ఘోయించరాదా ?'

'అవునది మంచిది.'

నాల్గు గంటలకు వారి రహస్యాలోచనము ముగిసినది. నవజీవన్ మెహతా యీవలకు వచ్చుసరికి ఈశ్వరలాలు బ్యాంకరు కనబడి 'హల్లో ! గుడ్ యీవినింగ్' అని నాడు ఏమి బ్యాంకర్ ! కాఫీ త్రాగుట కింతదూరము వచ్చినా ?' యని యడిగినాడు.

'ఒక ఖాతాదారునితో మాట్లాడవలసి వచ్చినాను. మా నేషనల్ బ్యాంకు' నమ్మకమునకు దగతరములనుండి ప్రఖ్యాతిగాంచి యున్నది. పెద్దపేరుగల ధనికుల ప్రైవేటు ఎకౌంట్లు యెన్నో మా బ్యాంకులో నున్నవి. ఆబ్యాంకు మేనేజరునై యుండుట ఎంతో భారముతో గూడినపని.'

ఈశ్వరలాలు బ్యాంకరునకు ముప్పదియైదేండ్ల వయస్సు. ఆతడు డాక్టరుతో సంభాషించుచుండగా చీనాదేశస్థుడొక డొకింత దూరమున నిలిచి పరికించుచుండెను. నవజీవన్ 'ఆ చీనాదేశస్థు డెవడో మనవంక చూచుచున్నాడు' అనగా నీశ్వరలాలు 'ఆతని పేరు ఫెంగ్ హో. అతడు వినాయకరావు కంపెనీలో బనిచేయుచున్నాడు' అని నాడు నవజీవన కాయమాపలుకులు విన్నంతనే జలదరించినది. ఇంతలోనే యతడు మాయమైనాడు. నవజీవన్ మెహతా కారునెక్కి కొలాబాకు బోయి భార్య సౌధముకడ కారు నాపినాడు. ఆతని కారు వెనుక కొన్నిగజముల దూరములో మరొక కారాగినది. ఫెంగ్ హోయీవలకు దిగి నవజీవన్ వంక వచ్చినాడు.

గవర్నర్ టెలిఫోను సమీపించి ఇంద్రభవనమునుండి నన్ననుసరించి వచ్చుచున్నావు. నీయుద్దేశమేమి?' అని యడిగినాడు.

'డాక్టర్! నాకు ఖూనీలనిన ప్రీతి. ఖూనీ కేసులలో సాక్ష్యమిచ్చుట నాకు సరదా ఖూనీ జరుగుచుండగా జూచుట మఱింత యిష్టము.'

'ఎవరి ఖూనీ చూడదలచినావు?'

'నీది సోమయాజా నిన్ను యెట్లు చంపునో చూచుటయే నా కోరిక నిన్నే కాదు—రత్నలాలును శకుంతలను కూడ.'

---

## పండ్రెండవ ప్రకరణము

---

“ఆమె యెప్పుడు వచ్చును?”

మనోరమాదేవి యెచ్చటికో వెళ్ళినదని యాతడు తెలిసికొన్నాడు. అతనికి గొంచెము చీకాకు కలుగకపోలేదు. అతడు ప్రిన్సెసు వీధిలోనున్న తన యింటికి బోయిన యొక నిమిషమునకు టెలిఫోను గంటమ్రోగినది. మనోరమాదేవి 'శకుంతల వచ్చునని బజారునుండి కొన్నివస్తువులు కొని తెచ్చుటకు వెళ్ళినాను గాని తనకు బని యున్నందున నేటికి రావీలులేదని యిప్పుడే యామె ఫోనులో జెప్పిన'దన్నది.

'వినాయకరావును గలిసికొన్నావా?'

'ఆ! దుర్మార్గు డేమనినాడో తెలియునా?'

'నీ దొంగతనముల నేమైన బయట బెట్టెనా? నీకెంత భాగ్యమున్నను ఆబుద్ధిని మానవు'

'సరే. ఇంక చాలింపుము. నీకు నా యందంత విశ్వాసము లేకున్న యెడల నాపిల్ల నిచ్చటికి బంపకుము.'

'ఆమెకడ పేర్కొనదగిన యాభరణము లెవ్వియు లేవు వినాయకరావింకేమనినాడు?'

'నేను నీభార్యనని చెప్పినాడు అనవసరముగా, నాచే నబద్ధ మాడించినావు.'

'ప్రమాణము చేయలేకపోయినావా?'

'ఏమిచేసినను లాభములేదు. ఆతడు నాసౌధముకడ రహస్యముగ వేచియుండుట కెవ్వరినో నియమించినట్లు ఊహింపనగును. నీవిచటనుండి యెన్నిగంటలకు వెడలిపోయినావో యాతడు చెప్పినాడు అదిగాక నేను నిన్నరాత్రి సినీమాకు బోవునపుడు నాసౌధములోనొక దొంగ ప్రవేశించినాడు ఆతడు డ్రాయరు లన్నియు వెదకినాడు.'

'దొంగయేనా? ఏమైన పోయినవా?'

'ఏమియు బోలేదు.'

ఫెంగ్ హో తనకు నిన్న నామె సౌధముకడ కాన్పించినాడే ఆమెసౌధము పరిశోధించిన దతడే యై యుండునా యని నవజీవన్ మెహతా యోచించినాడు.

'ఆమె యెపుడు వచ్చును' అని మనోరమాదేవి ప్రశ్నించినది.

'నేను తెలియ జేయుదునులే' అని రిసీవరును హుక్ నకు దగిలించినాడు ఆతని మనోగగన వాటికలో వినాయకరావు స్వరూపము కాన్పించినది.

---

## పదమూడవ ప్రకరణము

---

### సోయాకా వార్నింగు

శకుంతలతో వినాయకరావు తానుపనిమీద వెళ్లుచున్నాననియు నీలోపున నెవరో టెలిఫోనులో పిలుతురనియు వారికి సమాధానము

జెప్పవలసిన విధానము నామెతో జెప్పినాడు ఆతడు కుర్చీనుండిలేచి 'శకుంతలా! రంగూనులో నీమిత్రులెవరైన నున్నారా?' అని యడిగి నాడు——

'లేరు'

'కాని ధనసంపాదన కట నెన్నోమార్గములు న్యాయముగను అన్యాయముగనుకూడ నన్నుగూర్చి యటనెన్నో వదంతులు వ్యాపిం చియున్నవి.' అని యాతడు వెళ్ళిపోయినాడు ఆతని యుత్తరములు టైపుచేయుచు దనలో నామె యాలోచనా నిమగ్నయైనది. కొలది దినములకు బూర్వమే యతడు ఆఫీసులో ననవసరముగనున్న గుమా స్తాలను, నిర్లక్ష్యభావముగల గుమాస్తాలను దొలగించినాడు. ఆమెకు వినాయకరావు నిరంకుశాధికార మొకింత కష్టము తోపింపకపోలేదు. రత్నాలాలు ఏ దేశమునకో పోవుటకు సంకల్పించుకొనినాడు ఆఫీసు మూసిన పిదప నతడు నవజీవన్ మెహతా యింటికేగినాడు 'డాక్టర్! అంతయు ముగిసినది. బొంబే ట్రేడింగు కార్పొరేషను పేరుచెప్పి 0——2——0 అయినను సంపాదించలేము నేటి యుదయమున నీవుత్త రము వచ్చినది' అని యొక లేఖ నిచ్చినాడు.

'నీవు మామార్గమున కాటంకముగ నున్నావు. నీవు వెంటనే యీావర్తకము మాని, ఏజెంట్లనుగూడ విరమింపజేయుదునని వాగ్దా నము చేయుచో లక్షరూపాయలిచ్చెదను. లేదా నిన్ను మామార్గ మునుండి తొలగించుకొను యత్నముల మేమే చేయుదుము.'

ఇట్లు
S

'సోమోకాయే సంతకము జేసినాడు. నీకు లక్షరూపాయ లిచ్చుటకు సిద్ధమైన వారికి యేబదిలక్షల రూపాయలకు దక్కువ కాకుండ లాభమువచ్చును.'

'దీనికా వినాయకరావే కారణము. అయితే ఏమిచేయుటకు నిశ్చయించినావు?'

'వెడలిపోవుటకే నిశ్చయించినాను. మనము సంపాదించినది పంచుకొందము. మనకు సోయోకా యిచ్చెదనన్న మొత్తము కంటె చెటిమూడింతలు పంచుకొనవచ్చును. రాబోవు శుక్రవారమునాడు పంచుకొందము. సోమవారమునాడు నేను ఆస్ట్రేలియాకు బోవుదును. ప్యాసుపోర్టు వచ్చినది.'

'ఒక్కడవే వెళ్ళెదవా?'

'ఏమో. అది నీకెందులకు?'

'నాకదియే కావలయును. రత్నలాలు శకుంతలయే నాకు గావలయును. ఆలసింపకుము. లేకున్న సాయెకా తన బెదరింపును నిజము చేయును. నీవు సాధ్యమైనంత త్వరలో వెడలిపోవుట మంచిది.'

---

## పదునాల్గవ ప్రకరణము

---

### "ఏదో అభిమానము"

రత్నలాలు ఆఫీసుగదిలో గూర్చుండి వ్రాసికొనుచుండగా నౌకరు వచ్చి 'కేబిలుగ్రాము*వచ్చిన' దని యిచ్చినాడు ఆ కేబిలు గ్రాము సాంకేతికభాషలో (Code words) లో నున్నది. ఆపారిభాషిక గ్రంథమును దీసి యతఁడా కేబిలుగ్రాము చదువుకొనినాడు. అందులో నొకపేరు ఇంగ్లీషులోనున్నది. అది తనదికాదు. సోయోకా ప్రధాన ప్రతినిధియైన వినాయకరావున కెవరో పంపినది. పొరపాటున

* * * * * *

*కేబిలుగ్రాము:—సముద్రములో నుండు తీగెలద్వారా వచ్చు టెలిగ్రాము

నాశరుచే తన కందచేయఁ బడినది. సోయోకా రహస్య మాతనికి దెలిసినది. అతని హృదయము నిరవధికానందభరితమైనది. అలమారు లోని బుడ్డి తీసి గ్లాసులోఁ బోసికొని 'సోయోకా! నీ విపు డెచ్చటికి బోఫుదువు? సివు నాచేతిలోఁ జిక్కినావు' అని యా విస్కీ త్రాగినాడు అక్కసు మూసి వెడలిపోవుచు శకుంతల యాతడు త్రాగుచుండగా చూచి, తలపంకించి వెడలిపోయినది.

శకుంతల బీచ్ నుండినడిచి వెళ్ళుచుండగా బరిచిత కంఠస్వరము వినిపించినది ఆమె వెనుదిరిగి చూచినది. డాక్టర్ నవజీవన్ మెహతా!

'కారునెక్కి వెళ్ళెదవా? నాతో బస్సునెక్కి వచ్చెదవా?' యని యత డడిగినాడు.

'నేనింకా కుంటిదానను కాలేదు. నడిచియే వెళ్ళిపోయెద' నని శకుంతల చెప్పినది. ఇరువురును వివిధవిషయములగూర్చి సంభాషించుచు దాదరు చేరినారు. రత్నలాలు సౌధములోని కాతడు కూడ వచ్చి ''శకుంతలా! మనోరమాదేవి నీకొఱకు వేచియుండును. నేటి రాత్రియైన రమ్ము. ఒకనారమురోజు లొక స్నేహితురాలివద్ద నుందు నని రత్నలాలుతో జెప్పుము' అనినాడు.

ఆతడు రత్నలాలు గదిలో గూర్చుండినాడు. ఆమె మేడ మీదనున్న తన గదిలోనికి బోయి మఱొకచీర ధరించి వచ్చినది. ఆమె చేతిలో జిన్నతోలుసంచియున్నది. అందులో మూడు చీరలు, మూడు జాకెట్లు నున్నవి. ఆమె మనోరమాదేవి శతిథిగానున్న విషయము తెలిసినచో వినాయకరావేమైన నను నేమోయని యామె సంశయించినది. ఆమె క్రిందకు దిగి వచ్చినది. ఎనిమిది గంటలైనను రత్నలాలు రాకపోవుటచే 'శకుంతలా! ఒక చిన్నచీటి వ్రాసి యుంచి నాతో రమ్ము' అనినాడు.

'రాను. ఆతనితో జెప్పకుండ రాను'

'విశ్వాసవంతురాల'వని నవజీవన్ మెహతా వెడలిపోయినాడు. ఫెంగ్ హో యర్ధరాత్రమున వచ్చి బాకునుంచి వెడలిపోయిన వృత్తాంతము నామె డాక్టరుతో జెప్పలేదు. ఇంతలో రత్నలాలు తప్పటడుగులిడుచు మెల్లగా వచ్చినాడు. ఎందుచేతనో ఆవిషయము నామె నవజీవనునకు జెప్పదలచుకొనలేదు కారణము? వినాయకరావు నిరంకుశాధికారము సమ్మతము గాకపోయినను 'ఏదో యభిమానము' తన హృదయమున నాతనియెడల జనించినది.

## పదునైదవ ప్రకరము

### హత్య

ఇన్‌స్పెక్టరు చంద్రమోహన్, పోలీసు హెడ్ స్టేషనులో నుండు సూపరింటెండెంటు డిల్లీకిబంపవలసిన రిపోర్టు టైపుచేసి, సంతకముచేసి కవరులోనుంచి, అంటించునంతలో కానిస్టేబిలు వచ్చి, 'డాక్టరు నవజీవన్ మెహతాగారు వచ్చినా'రని చెప్పినాడు.

'లోనికి రమ్మను.'

'హల్లో డాక్టర్! గుడ్ యీవెనింగ్!'

హల్లో ఇన్‌స్పెక్టర్! వెరీ గుడ్ యీవెనింగ్' అని కూర్చుండినాడు. ఇన్‌స్పెక్టరు చంద్రమోహన్ నిల్చునినాడు.

'ఇప్పుడు సరిగా 8—45 అయినది. తొమ్మిది గంటలకు నేనొకరిని చూడవలసియున్నది. ఏదైన ముఖ్యమైన పనియున్నదా?'

'లేదు. ఈమనస్తత్త్వముందుల నమ్ము కంపెనీలను గురించిమాట్లాడుటకు వచ్చినాను.'

'నీకేమైన దెలియునా?'

'అంతగా దెలియదుగాని యూహించి చెప్పుటకుజాలసంగతులున్నవి.'

'రత్నలాలుకు నీవు స్నేహితుడవా?'

'అవును చంద్రమోహన్! చాల సంవత్సరములనుండి యతని నెఱుగుదును. ఎందుచేత నతడు నామిత్రుడా యని యడిగినావు?'

'ఏమియును లేదు. అతనినే నేనిపుడు కలసికొనబోవుచున్నాను. ఏదో ముఖ్యమైన విషయము చెప్పునట. అదెట్టి విషయమో నీకు దెలియునేమో యని——'

'నాకు దెలియదు. నేను కూడ నీతో రావచ్చునా!'

'రమ్ము. అతడు నీకు దెలియరానివిషయము చెప్పచో——'

'నేను వెడలిపోయెదను'

ఇంతలో టెలిఫోనుగంట మ్రోగినది. ఇన్స్పెక్టరు రిసీవరును జెవిచెంత నిడుకొని 'ఎవరు వారు?'' అని ప్రశ్నించినాడు.

''నేను రత్నలాలును. మిష్టర్ చంద్రమోహన్! 9 గం॥ కావచ్చినది ఇంకను రావేమి?'

'ఇదిగో యిప్పుడే బయలుదేఱుచున్నాను.'

'రావలయును. సోయోకా ముఖ్యప్రతినిధి యెవరో తెలియునా?' అని యాప్రతినిధిపేరు నతడు మెల్లగా బలికినాడు. అది విన్నంతనే చంద్రమోహన్ ఉలిక్కిపడినాడు.

'చంద్రమోహన్! అతడు చెప్పినదేమి?' అనినవజీవమెహతా యడిగినాడు. చంద్ర పరధ్యానముగా నున్నట్లు నటించినాడు. అతడు డాక్టర్! రత్నలాలుమేనకోడ లింటిలోనే యుండునా' యనినాడు——

'నా బంధుగురాలిని జూచుటకు వెళ్ళెదనని చెప్పినది. సోహో శా యనిన రత్నలాలున కపరిమితమైన భయము.'

'సోహోశాను గూర్చి నీకేమి తెలియును?'

'తెలియదు. అది యాతని భ్రాంతి. ఆభ్రాంతితోనే బాధ పడుచున్నాడు.'

ఇరువురును నడచి, పదినిమిషములలో దాదరులోని రత్న లాలు సౌధము చేరినారు. వీధితలుపుకడనుండు గంటను నొక్కినాడు. చంద్రమోహాన్ తలుపుల ద్రోసి 'ఇవి తెఱవబడియే యున్నవి. ముందు నీవు పద' యనినాడు.

'ఇదియేమి—సౌధమంధకార బంధురమైయున్న' దనుచు నవజీవన్ మెహతా హాలులోని గోడను తడుముకొనుచుబోయిస్విచ్ నొక్కినాడు దీపము వెలుగలేదు. 'ఇది రత్నలాలు గది' యని యతడులోన బ్రవేశించినాడు. చంద్రమోహాన్ కూడ వెనుక వెళ్ళి నాడు. అతడు ఆయంధకారములో దడుముకొనుచు స్విచ్ నొక్కి నాడు. విద్యుద్దీప మిప్పుడును వెలుగలేదు. పడకకుర్చీని నవజీవన మెహతా తడుముకొనుచు జేరినాడు. అతడు కుర్చీలో బరుండియున్న రత్నలాలును లేపి 'రత్నలాలు!' అని పిలిచినాడు.

'అవును...ఆదుర్మార్గులు...ప్రయోగించినారు ... నాది... మైనశరీరము.'

'రత్నలాల్! ఇన్‌స్పెక్టరు చంద్రమోహాన్ నీకొరకు వచ్చి యున్నాడు లెమ్ము.'

'బహుశః అతడు లేవజాలడు. డాక్టర్! ఈగదిలోమరొక రున్నారు. అగ్గిపెట్టె' అని తలుపుకడ నిలిచినాడు. ఇంతలో నొకడు తనప్రక్కనుండి వెళ్ళుచుండుట నడుగుల సవ్వడిచే గ్రహించి చంద్ర మోహాన్ యాతని భుజము పట్టుకొనినాడు. ఒక్కసారిగా గిజా

యించుకొని యాయపరిచితుడు చంద్రమోహన్ దవడపగులునట్లు కొట్టినాడు. ఆతడు వెడలిపోవునపుడు చైనాభాషలో నేవో తిట్టినాడు. నవజీవన్ యీపలుకులవిని నాలుగడుగులు వెనుకకు వైచినాడు.

'డాక్టర్! అగ్గిపెట్టె—'

'ఇదిగో' యని యాత డగ్గిపెట్టె గిరవాటు వైచినాడు. అగ్గి పుల్ల వెలిగించునంతలో విద్యుద్దీపములు వెలిగినవి. ఒక్కసారిగా వెలుతురు వచ్చుటచే వారికనులు చీకట్లు గ్రమ్మినవి.

'ఇదియేమి? హత్య?... ఎవరు చేసిరి?— చూడు' మని చంద్రమోహన్ భయానక దృష్టితో దడబడుచు ననినాడు. రత్న లాలు పడకకుర్చీలో ముద్దవలె బడియున్నాడు. అతడు ధరించియున్న యాహారము రక్తాసిక్తమైయున్నది. బాకుగుండెలలోనికి జొచ్చుకొని పోయి, పిడిమాత్ర మీవలకు గన్పట్టుచున్నది.

'చనిపోయినాడు. మన మిచట నుండగనే హత్యజరిగిన' దని డాక్టరును నిర్నిమేషలోచనముల వీక్షించి. 'అదియేమి? ఆమూల' వనినాడు.

ఆమూల నొకచో బడియున్న శకుంతలను వారు చూచినారు. ఆమె జాకట్టు చినిగిపోయి యున్నది. ఫాలభాగమున రక్తపు మచ్చ లున్నవి.

'శకుంతలా! యని డాక్టరు నాశ్చర్యముగ బలికినాడు.

---

పదునాఱవ ప్రకరణము

శకుంతల రహస్యము

ఇన్‌స్పెక్టరు చంద్రమోహను శకుంతల వంక నొకసారిచూచి చరచర వీధిలోనికి బోయినాడు. ఆతని యీూలనువిని షూరుగజముల

దూరములోనున్న నొక పోలీసు పరుగెత్తుకొని వచ్చినాడు. నీ నెంబరు ?' అని యిన్‌స్పెక్టరనినాడు.

'759 సార్.'

'ఇచ్చట హత్య జరిగినది. ఈదారి నిప్పు డెవరైన వెళ్ళుట చూచినావా ?'

'చూచినాను ఒక చైనావాడు వెళ్ళినాడు. టోపీలేదు.'

'సరే. వెంటనే మఱొక కాన్‌స్టబిలును దీసికొనిరా. ఆత డేవైపు పరుగెత్తినాడు ?'

'క్రింజను పార్కువైపు. ఆతడు వచ్చినపిదప నీవు వీధి ద్వారముకడ నుండుము. అతనిని పాణిద్వారముకడ నుండమనుము. ఎవరిని లోనికి రానీయవలదు.'

ఇట్లు చెప్పి యతడు లోనికేగినాడు శకుంతల హాలులో నొక కుర్చీలో గూర్చుండినది. తానంతకు మున్నామె ఫాలరంగమున జూచిన రుధిరములేదు. డాక్టర్ చేతిలో నొక జేబురుమాలున్నది జరిగిన దేదో యతడు గ్రహించినాడు—

'నామేనమామ రత్నలాలు హత్య చేయబడినాడని డాక్టరు చెప్పుచున్నాడు నిజమేనా ?' యని ఆమె చంద్రమోహాను నుద్దేశించి యడిగినది.

'నీవు చూడలేదా ?'

'ఆమె యాభయంకరదృశ్యము చూచినచో గుండె లదరి పోవునని భయపడి దీపము లార్పివైచి యిటకు గొనివచ్చినాను.'

'అవును. ఆతడే చంపియుండు'నని యామె పల్కినది.

'ఎవ ?' రనినాడు చంద్రమోహన్.

'నేను మొదటనుండియు జెప్పెదను. రాత్రి నేనొక స్నేహితు ఖాలి యింటికి బోదలచి రత్నలాలుతో జెప్పగా నతడు వీలులేదని

తన గదిలోనికి రమ్మని యొకచో గూర్చుండ నియమించినాడు. రెండు సీసాల విస్కీని గడగడ త్రాగివైచినాడు మరియు టెలిఫోను చేసినాడు. అతడట్లు త్రాగి యేమిచేయునో యని వెడలిపోవుటకు మెల్లగా లేచినాను. అతడు కోపముతో గాజుగ్లాసును నాముఖముపై గిరవాటు వైచినాడు. అది తగిలి రక్తము వచ్చినది దీపమార్పివైచి యతడు యీజీచైరులో గూలబడినాడు. ఇంతలో టార్చిలైటు కాంతి ఆతని ముఖముపై బ్రసరించినది. ఆలైటు నెవరు ప్రసరింపజేసినారో నాకు తెలియదు.'

'అట్లయిన నతడే రత్నలాలును హత్యగావించియుండునని నా యుద్దేశము. ఆతడు చాల త్వరితగమనము గలవాడు మేము కొన్ని యడుగుల దూరములో నుండగనే యీహత్య జరిగినది. అయితే అమ్మాయీ! ఈ భయంకరరాత్రమున నీవిచటనుండుట శ్రేయస్కరముకాదు.'

చంద్రమోహన్! ఆమెకొఅకీరాత్రి మోడరన్ హోటలులో నొకగది నద్దెకు దీసికొండు'నని డాక్టరు నవజీవన్ మెహతా పలికినాడు కొలాబాలోనున్న తనవదినెగారి సౌధమునకు రమ్మని యతడనునేమో యని శకుంతల సంశయించినది. తన భార్య ప్రమేయమున్నచో నామె తన భార్యయని యందఱకు తెలియునేమోయని యామాటనే నవజీవన్ మెహతా తలపెట్టలేదు.

హత్యాసమాచార మింతలో దెలిసి కొంతమంది జనము రత్నలాలు సౌధప్రాంగణమున గుమిగూడినారు హెడ్ స్టేషనుకు ఫొటోగ్రాఫరును వ్రేలిముద్రల యుద్యోగిని (Fingure-print Expert) పంపుమని చంద్రమోహన్ హత్యావృత్తాంతమును టెలిఫోనుచేసినాడు ఇంతలో నొక వ్యక్తి వచ్చి లోనికి పోబోవ కాన్ స్టబిలాపినాడు

అతనిని గుర్తించి చంద్రమోహన్ ముందుకువెళ్ళి 'ఓ మిష్టరు వినాయకరావు! గుడ్ నైట్' అనినాడు.

'గుడ్ నైట్ రత్నలాలు హత్యగావింపబడినాడట'

'ఎవరు చెప్పినారు? అతడు నీస్నేహితుడా?'

'కాదు ఇన్ స్పెక్టర్. అతడు మాకంపెనీలో మేనేజరుగానున్నాడు. ఈజనసమూహ మందఱకును నిచట హత్య జరిగినదని తెలియును. శకుంతల యెక్కడ!'

'ఆమె నెల్లెఱుగుదువు? అదిగాక రత్నలాలుకు విరోధు లెవరైనగలరా?'

'నాకు దెలియదు. ఆమె నాకంపెనీలో స్టెనోగ్రాఫరుగనున్నది. ఆమె నొకసారి చూడవచ్చునా?'

'ఆ! చూడవచ్చునుగాని మెచ్చటకు దీసికొనిపోరాదు. ఆమె ఆగదిలోనుండగనే హత్య జరిగినది. ఆమె సాక్ష్య మవసరము' అని చంద్రమోహన్ లోనికేగి యాతని రాకను గూర్చి శకుంతలతో జెప్పినాడు. ఆమె యీవలకు వచ్చిన పిదప వినాయకరా విట్లనినాడు.

'రత్నలాలునెవరో హత్యగావించినారని యిప్పుడేవినియున్నాను. ఆతనికి రావలసిన జీతమున్నది వలయుచో నీకు అడ్వాన్సుగా కొంతధన మిచ్చుటకు వచ్చినాను. ధనమేమైన కావలయునా?'

సానుభూతి యించుకయు ధ్వనింపని యామాటలీఱు ఆమె కత్యధికక్రోధము, నసహ్యము కలిగించినవి. 'వలదు. ధనమేమియు వల'దని శకుంతల యనగా నతడు 'సరే. నేను వెళ్ళెదను. రేపటి యుదయమున మామూలుగ పదిగంటలకే ఆఫీసునకురమ్ము. చాల యుత్తరము లున్న'వని, యామె ప్రత్యుత్తరముకొఱకు నిరీక్షించక యుండగనే వెడలి పోయినాడు.

'పసుపు; ఆఘనుకు పదిగంటలకే రావలెనట' నని శకుంతల విసిగికొన్నది. ఇంతలో డాక్టరు నవజీవన్, చంద్రమోహాన్, పోలీసులువచ్చినారు. 'ఇదిగో అమ్మాయీ! ఈటోపీ రత్నలాలుగదిలో దొరకినది. ఇది యాతనిదేనా?' యని చంద్రమోహాన్ ప్రశ్నించ 'కాదు. ఇట్టి టోపీ నతడెప్పుడును ధరించలే' దని యామె బదులు పలికినది.

'అయితే శకుంతలా! టార్చిలైటును జూపిన యాక్రొత్త మనుజుని దీపపుకాంతిలో జూడలేదా?'

'లేదు. ఆకాంతి యొక్క క్షణమాత్రమే ప్రసరింపబడినది.'

శకుంతల యెందుల కసత్యమాడినది? తన్ను బాల్యమునుండి పోషించి యాదరించిన రత్నలాలును హత్యగావించిన దురాత్ముని పేరు తనకు దెలిసియు నేల నతనిని రక్షింపబూనినది? ఆగదిలో నత డున్నపుడు బాగుగా గుర్తించినది. అతడు ఫెంగ్‌హో వినాయకరావు ప్రియమిత్రుడు.

---

## పదునేడవ ప్రకరణము

### ఆఫీసులో

శకుంతల యారాత్రి చాల నేపటివఱకు నిద్రించలేదు. రత్నలాలు హత్య—ఫెంగ్‌హో ఆగదిలోనుండుట అదృశ్యమామెకు కన్నులను గట్టినట్లున్నది. ఫెంగ్‌హో— వినాయకరావు—ఇరువురి చర్యలు నిరంకుశములు. ఆమె కాతని కంపెనీలో పనిచేయుట కిష్టములేదు. ఆమేడ వంకరమెట్లు నెక్కుట—గింగుఱుమను యాతని టేబిలుగంట మ్రోగినంతనే విషోరగమును సమీపించుమూషికమువలె నాతనిగదిలోని కేగుట—యివి యామె కసహ్యము కలిగించినవి. ఆమె లేచి

తన యుద్యోగమునకు రాజినామా యుత్తరము వ్రాసినది. మఱల చించివైచినది. తెల్లవారఝామున నాలుగుగంటలువరకు నామెనిద్రింపక యేదో యాలోచించుచునే శయనించి, యప్పుడు బడలికయెక్కువకాగా నిద్రించినది. తొమ్మిదిన్నరకు బయలుదేరి ఆఫీసునకు బోయినది. అచట నందఱును ఆమె నూరడించినారు. గడియారము పదిగంటలు కొట్టినంతనే వినాయకరావు ఆఫీసుగదిలోని గంటమ్రోగినది.

నోటుబుక్కు తీసికొని శకుంతల యాగదిలోనికి బోయినది. ఆతడు రత్నలాలు మరణమును గూర్చి యొక్క సానుభూతి వాక్యమైనను బలుకక ఢిల్లీ, సూరత్, కలకత్తా, రంగూను నగరమునందలి వర్తకులకు పండ్రెండు లేఖల జెప్పెను. తానుద్యోగము మానివేయుటకే వచ్చితినని యామె చెప్పుటకు దగిన యవకాశమునే యతఁడొసఁగలేదు. ఆమె వెడలిపోవుచు 'రాత్రి రత్నలాలును హత్యగావించుటకు వచ్చినవానిని నేను కనులార జూచినానుకాని పోలీసులతో జెప్పలేదు' అన్నది.

'అతడెవరు?'

'ఎవరా? ఫెంగ్ హో?'

'శకుంతలా! ఫెంగ్ హో కాదు. పొరపడినావు అతడురాత్రి'

'మీతో నుండెనా?'

'లేడు పూనాలో నున్నాడు.'

'ఏమో. నేను కనులార చూచినాను. ఆతని ఫెల్టుటోపీ (Felt Hat) పోలీసులకు దొరికినది. బీటులోని రక్షకభటుడు టోపీలేని చైనావాడు పరుగెత్తుచుండగా జూచినాడట.'

వినాయకరావు నిర్విణ్ణుడైనాడు. ఆమె వెడలిపోయినది. అరగంటమైన పిదప నొకమాట తెలియకపోవుటచే శకుంతలవినాయకరావు గదిలోనికి వెళ్ళినది. అతడు లేడు గంటవఱకును దిరిగిరాలేదు;

ఈలోగా నాతడు మోడరన్ హోటలులో గూర్చుండి నౌకరును కౌనిల్సు జనరల్ స్టోర్సుకంపి, ఫెంక్ హాట్ ధరించిన టోపీవంటిబూడిద రంగు ఫెల్టుటోపీని నల్లరిబ్బను కలదానిని తెప్పించినాడు.

---

## పదునెనిమిదవ ప్రకరణము

ఇండియన్ ట్రేడింగుకంపెని కార్యాలయము

ప్రిన్సెసువీధిలోని తన సౌధమున గూర్చుండి డాక్టరు నవజీవన్ మెహతా యత్యావసరములైన యుత్తరములను వ్రాసికొనుచున్నాడు అతనికి 'ఇండియన్ ట్రేడింగుకంపెని'నీనిగూర్చినవిషయమంతయునగమ్య గోచరముగానున్నది. రత్నలాలు హత్యకు బూర్వమతనితో నొకసారి సంభాషించియున్నచో వివమ సమస్యలుగా దోచుచున్నవన్నియు జిక్కువీడియుండునుగదాయని యాతడు పశ్చాత్తాపతప్తుడు కాసాగి నాడు. మత్తుమందుల యెగుమతి దిగుమతిచేయు నారహస్యవ్యాపా రము మిగిలిన వాటాదారులకు వారిలాభములబంచి యీయగా సుమారారు లక్షలరూపాయలు తనకు రత్నలాలుకు మిగిలియున్నదని ఆధనము సెక్యూరిటీల రూపముననున్నదని యతడెరుగును. మూడు లక్షలరూప్యములు తనవి మిగిలిన మూడు లక్షలకు రత్నలాలు వార సులు కర్తలు.

అతని మనోగగనమున శకుంతల విద్యుల్లతవలె మెఱసినది. ఆమెయే మూడులక్షలకు నధికారిణి. చక్లావీధిలో 153 నెం॥ సౌధ మునన్న ఇంకయన్ ట్రేడింగుకంపెనీ గదిలోనున్న యినుపమంద సముననే ఆఅరులక్షల రూపాయల సెక్యూరిటీ పత్రములున్నవి. ఆమెకు దెలియకుండ నాసెక్యూరిటీలను దానే యపహరించినచోతనకుప్రాప్తిం

చినంత భాగ్యమునకామె యధికారిణి కాజాలదు, తన యిచ్చవచ్చిన పుడే నాలుగు వేల రూప్యములను ఇూయవచ్చును.

ఇట్లు తలపోయుచు నతఁడు టెలిఫోనులో శకుంతలను బిలిచి 'చాలముఖ్యమైన విషయములు మాట్లాడవలసియున్నది. ఆఫీసు కట్టమైనపిదప నిచ్చటకు రమ్ము'ని చెప్పినాడు. ఈలోగా నతడు కాఫీ త్రాగి మనోరమా దేవితో కొలది నిమిషములు టెలిఫోనులో సంభాషించినాడు. అయిదు గంటలైనది. రిస్టువాచీ చూచుకొని, కిటికీచెంత నిలువబడి నవజీవన్ మెహతా శకుంతల రాకను నిరీక్షించ సాగినాడు. వారిద్దరును అయిదారు వత్సరములనుండి యీ రహస్యవ్యాపారము చేయుచు నపారలాభము లార్జించియున్నారు. ఆతడొక్కసారిగా దనకును, రత్నలాలుకును స్నేహమైనదాదిగా జరిగినదంతయు నతడు బొంబే ట్రేడింగు కంపెనీపేరుతో విస్తారముగా మత్తుమందుల నెగుమతి చేయుట నతడు బలిగొనైన దుర్గుణములను తాను హితముగ నుంచుమని బోధించుట మున్నగునదంతయు జ్ఞప్తికి దెచ్చుకొనినాడు.

అరగంటయైన పిదప శకుంతల వచ్చినది. ఆమె యాయాస ఖిన్నవదనయై యున్నది. 'నేనిక నచ్చట పనిచేయలేను. రేపు నాయుద్యోగమునకు రాజీనామా నిచ్చెదను' అనినది.

'ఉద్యోగమును మానివేయుచునని యాతనితో జెప్పినావా?'

'లేదు. ఆతనితో జెప్పుటకు దగిన యవకాశము లభించనే లేదు. అబ్బా! ఆ వినాయకరావు కంపెనీమాట తలపెట్టకుము నాకు ఒడలు మండిపోవుచున్నది. ఏదైన సంతోషకరమగు విషయము జెప్పుము.'

నౌకరు కాఫీ తీసికొనిరాగా, నది త్రాగి శకుంతల కొంచెము తేరుకొనినది. 'శకుంతలా! ఇండియన్ ట్రేడింగ్ కంపెనీ పేరెప్పుడైన వినియున్నావా?'

'వినియున్నాను. వినాయకరా వొకసారి నీవు ఇండియన్ ట్రేడింగు కంపెనీలో బనిచేయుచున్నావా?' యని యడిగినాడు.

'నేను వినలేదని చెప్పియుందువా?'

'అవును. ఆకంపెనీని గూర్చి రత్నలాలుకు తెలియునా?'

'నిజము చెప్పెదను. రత్నలాలు స్వలాభాకాంక్షియై ఏదో వ్యాపారము సాగించుకొనుచున్నాడు, ఒకవేళ వినాయకరావు కంపెనీలో మానివేయవలసి వచ్చినచో స్వతంత్రముగా జీవించుటకు వలయు ధనము నార్జించుకొనినాడు.

'అట్లయిన ఇండియన్ ట్రేడింగు కంపెనీ రత్నలాలుదేనా?'

'అవును. నేనొకసారి ఆయాఫీసు చూచినాను. ఆకార్యాలయమున నున్న యినుపమందసములో గొన్నిపత్రములున్నవని రత్నలాలు చెప్పియున్నాడు. ఆతనికి వినాయకరావు ప్రబల విరోధి రత్నలాలును గుటించి పోలీసు లాచోకీ తీయకమునుపే, ఆమందసములో నేమున్నదో చూచి తీసికొనివచ్చుట యుక్తము. శకుంతలా! నాతో చక్లా వీధిలోనున్న ఆకంపెనీ కార్యాలయమునకు వత్తువా?'

''ఆదస్తావేజులు మున్నగునవి యినుపమందసములో నున్నయెడల నీకెట్లు లభించును?'

'తాళపుజెవి నాకడనున్నది ప్రమాదమేదైన సంభవించినచో నామందసమును నేనొక్కడనే తీయనగునని యాతడు తాళపుజెవిని నాకొసగెను.'

* * * * * *

అప్పటికి సరిగా ఏడు గంటలైనది. చక్లావీధిలో జనసంచారము చాలవరకు సన్నగిలినది. నవజీవన్ మెహతాయును, శకుంతలయును కారునుండి క్రిందకురిగి, సౌధముపై కలిగినారు.

ఆప్రాంతములోనున్న యంగడులన్నియు మూయబడియున్నవి. ఒకగదితలుపుమీద 'ఇండియన్ ట్రేడింగుకంపెనీ' యిత్యాది యక్షరములుండుట నామె చూచినది. డాక్టరు తలుపుఁదెఱచినాడు. ఇరువురును లోన బ్రవేశించినారు. ఆతడు స్విచ్ నొక్కినాడు. గదియంతయు ధూళిధూసరితమై యుండుటచే నామె తలుపుగడియకైచి యొక కుర్చీపై గూర్చుండినది. డాక్టరు నవజీవన్ యినుపమందసము తెఱచి, యొక్కయెదటున 'ఆ! ఆ!' యనుచు కూలబడినాడు. దానిలో ధనమేమియు లేదు.

తలుపు నెవరో తట్టినారు. శకుంతల 'నవజీవన్! ఎవరో తలుపు తట్టుచున్నా' రనినది.

ఆతడు వెనుదిరిగి చూచి 'పోరా! క్లీనర్' అనినాడు——

'క్లీనరుకాదు, ముందుగా తలుపు తెఱువు' మని యాతడు పలికినంతనే శకుంతల నిర్విణ్ణయైపోయినది. కంఠస్వరమును బట్టి యావచ్చిన యతఁ డెవరో ఆమె గుర్తించినది. ఆతడు వినాయకరావు!

---

## పంచాల్మిదవ ప్రకరణము

సోయోకాపగ

శకుంతల తలుపు దెఱువగా వినాయకరావు లోనికి వచ్చి 'శకుంతలా! తుదకు ఇండియన్ ట్రేడింగుకంపెనీ కార్యాలయమునకు వచ్చినావు. కాని ఆనాడు నే నీ కంపెనీని గూర్చి విననేలేదని నీవు చెప్పినపుడు నేను నమ్మినాను సుమా' యనినాడు. నవజీవన్ మొహతా వినాయకరావు వంక నిర్విణ్ణుఁడై చూచి 'అట్లయిన సోయోకావు

నీవేనా?' యనినాడు. ఆతఁడు మఱల 'శకుంతల మేనమామ రత్నలాలు యిచట దాచియుంచిన ధనమును పత్రములు ఆమె కిచ్చుటకుఁ గొనివచ్చినాను గాని అవి యేమియు నిట లేవు. అవి యేమైనవో సోమోకాకుఁ దెలిసియుండవలెను.' అనినాడు.

'ధనమా? నాకామాట నింతవఱకు నేల చెప్పలేదు డాక్టర్?' అనినది శకుంతల.

'అది యెటనున్నదో రత్నలాలుకే తెలిసియుండవలె' నని వినాయకరావు పలుక నవజీవన్ మెహతా యిట్లనినాడు.

'వినాయకరావు! రెండుకంపెనీలు పనిచేయుట కవకాశము లేదని నేనెఱుఁగుదును ఇంతవఱకు జరిగిన దేదో జరిగినది ఇకముందు మీ కేమియు నపకారము వాటిల్లదు.''

'సరే ఆమాట గమనించి మెలగుచుండుము ఆతని మార్గమున కడ్డయిరాకుము, ఆతడు మిక్కిలి ప్రమాదము కలిగించును.' ఇట్లు పలికి, వినాయకరావు వెడలిపోయినాడు. నిర్విణ్ణుడై, నిశ్శోష హాతుఁడై నవజీవన్ మెహతా యినుపమందసములోనున్న పత్రముల దిరుగవైచినాడు ఏదో ముఖ్యమైన కాగితము దొరకగా నతఁ డది శకుంతల చూడకుండ జేబులో దాచుకొనినాడు. ఆ కాగితములో నేమున్నదో చూచుట కతని కాత్రము హెచ్చుకాఁగా, నామెతో నీవలకు వచ్చి, కారునెక్కి, మోడరన్ హోటలుదగ్గఱ విడిచినాడు.

శకుంతల 'ఆధనమెవరిది? వినాయకరావుదా? రత్నలాలపహరించినాడా? అందుచేతనే వినాయకరావువచ్చి తన సొమ్ము తాను తీసుకొనియుండును. అయితే రత్నలాలు...?' అని ప్రశ్నింప, నతడు 'శకుంతలా! దయయుంచి నన్ను ప్రశ్నలచే విసిగించకుము' అని యామెనటవిడిచి తిన్నగా ప్రిన్సెసువీధిలోని నిజసౌధమునకుబోయి, మెట్లెక్కుచుండగా వెనుకనుండి యొకడు క్రర్రతో బలముగఁగొట్టి

నాడు. ఆదెబ్బ యదృష్టవశమున నవజీవన మెహతాకు దగులలేదు. మఱొకడు బాకుతో బొడువబోవ నది భుజముపైనున్న కోటును వేస్టుకోటును, అధారమును జీల్చుకొని కొంచెముగ గాయమైనది. ఇంతలోవాడు జేబులోనుండి రివాల్వరుతీసి పైకెత్తిగా 'జాగ్రత్తి సోదోకా' అనుచు నాయిరువురును బరుగెత్తినారు. ఆతడుతనగదిలో నికివెళ్ళి 'సోదోకా పగసాధించుటకు దృఢముగ నిశ్చయించుకొని నాడు' అనెను.

---

## ఇరువదియవ ప్రకరణము

---

### ఈశ్వరలాలు సంభాషణ

మఱునాటి యుదయమున డాక్టరు నవజీవన్ మెహతా హారన్బీ రోడ్డున నున్న ఈశ్వరలాలు నేషనల్ బ్యాంకునకుబోయి, తన కార్డు పంపెను. పదినిమిషములైన పిదప నొకరువచ్చి యాతనిని ఈశ్వర లాలు గదియొద్దకు గొనిపోయెను. మనోజ్ఞములైన పటములతో నలం కరింపబడి మిక్కిలి విలువైన కుర్చీలతోను బీరువాలతోను నిండి యున్నగదిలో డాక్టరు నవజీవన్ మెహతా ఈశ్వరలాలున కెదురుగా గూర్చుండి 'మిత్రమా! నీలేఖచూచి, వెంటనే బయలుదేఱి వచ్చినా' ననినాడు.

'సరే నీచెక్కుచాల ముత్తమునకున్నది. ఓవరుడ్రాఫ్టు అగు నేమోయని సందేహము. అయినను స్నేహము కేసుగా భావించి నీ చెక్కుచెల్లింప జేయుదును.'

'సరే ఈశ్వరలాలు! నిన్ననే నిన్ను టెలిఫోనులో నడుగుద మని తలచినాను వినాయకరావు ఎవరు?'

'అతనిని నీవెఱుగవా? నేనతనిని అతని స్నేహితుడగు నాచై నావానిని కూడ యెఱుగుదును డాక్టరు! నీతో గొన్ని రహస్యవిషయములు మాట్లాడుచున్నాను. బ్యాంకు రూల్సుకు విరుద్ధముగా జెప్పు చున్న విషయమును గమనింపుము. వినాయకరావునకు మాబ్యాంకుతో జాల పెద్దమొత్తమునకు అక్కౌంటు వున్నది. అట్టివాని ఎకౌంటు నాబ్యాంకులో నుంచుట కిష్టములేదు.

'అతనినిగూర్చి నీకుగల యనుమానమేమి.'

'నవజీవన్! నిన్నటిదినమున వినాయకరావు పెద్దమొత్తమును బ్యాంకులో డిపోజిట్టు చేసినాడు.'

'ఆఱులక్షలరూపాయలు—సెక్యూరిటీల రూపములో నున్నది కాదూ?'

'అవును అంతమొత్తమని నీకెట్లు తెలియును?'

నవజీవన్ మెహతా జవాబునీయకుండుట గమనించి, ఈశ్వరలాలు' మిత్రమా! అతడాధనమునకు వడ్డీలేకుండ సేఫ్‌డిపోజిట్‌లో నుంచినాడు ఎంతవడ్డీ ముప్పదివేల రూపాయలవడ్డీ నష్టము అంతధనమతని కెచ్చటనుండి వచ్చినది. అదిగాక అతడొక సీలువేసిన కవరు నుంచినాడు దానిపై ' నవజీవనమెహతాకు వ్యతిరేకమైన సాక్ష్యము. సోమోతా కుపయోగించును' అని యున్నది ఆకవరునాతడు నేటియుదయమున దీసికొనిపోయినాడు ఒకసారి రత్నలాలుతో జేపు మాట్లాడవలె' ననినాడు—

'రత్నలాలు హత్యగావింపబడిన విషయము తెలియదా?'

'అయ్యో! హత్యయా! నేను విననేలేదు. ఎప్పుడు?'

'మొన్నరాత్రి పంచాయతీసాక్ష్యమున్నది. నేనిప్పుడే కోర్టునకు బోవలసియున్నది'

'డాక్టర్! నేనుకూడ వచ్చెదను. అయితే హంతకుడెవరని నీయనుమానము?'

'ఒక చైనావాని ననుమానించినాము. అతనిని పోలీసు లరెస్టు చేసినారు కాని ఆతడు మొన్నరాత్రి హత్యజరిగినసమయమునకు సూరత్ పోలీసుస్టేషనులోసబిన్‌స్పెక్టరుతో మాట్లాడుచున్నట్లుకబురువచ్చినది. ఆతనిటోపీ రత్నలాలు సౌధమున దొరకినది. ఆతనుటోపీలేకుండనుండు నని పోలీసులు తలచినారుగాని, అత డట్టిటోపీనే ధరించియున్నాడు.'

'విచిత్రమే'

'ఆచీనావా, డెవరోయై యుండవచ్చునుగాని సూరత్‌లోనతడు ఫెంగ్ హో తనపేరని చెప్పియున్నాడు—'

'ఫెంగ్ హో!' అని నాశ్చర్యముగా బలికినా డీశ్వరలాలు.

నవజీవన్ మెహతాయును, ఈశ్వరలాలునుకోర్టుకుబోయినారు. అంతకుమున్నే శకుంతల సాక్ష్యమిచ్చియుండెను. ఆతని సాక్ష్యము ముగిసినపిదప శకుంతలను సమీపించి 'శకుంతలా! నిన్నరాత్రి నేనట్లు ప్రవర్తించినందుల కన్యథా భావించవలదు. ఇప్పు డెటకరిగెదవు. నేటిరాత్రి నైనను మనోరమాదేవి సౌధమునకు రమ్ము' అనినాడు.

'వీలులేదు. ఆఫీసుపని యున్నది. ఉద్యోగమును మానినానని యుత్తరము వ్రాసి పంపినాను. దయయుంచి, నీ కారుమీద ఆఫీసువఱకు గొనిపొమ్ము' అని యామె వాక్రుచ్చినంతనే యతఁడు కారు తలుపు తెఱచినాడు. ఈశ్వరలాలుబ్యాంకరు నామెకతడు పరిచయమొనరించినాడు. ఆమె కారునుండి దిగి ఆఫీసులోని కరుగుసరికి పదిన్నరగంటలైనది. తన యాలస్యమునకు మన్నింపుమని యామె వినాయకరావును కోరఁదలచుకొన్నది. గాని యతడు 'శకుంతలా! నీవీయుద్యోగమునకు రాజీనామా నిచ్చిన యుత్తరమందినది. మానివేయుటయే నీనిశ్చితాభిప్రాయమా?'

'అవును. నన్ను మీారు చాల నిరసనగా, జూచుచున్నారని నాయుద్దేశము——'

'ఇండియన్ ట్రేడింగుకంపెనీనిగూర్చి యిప్పుడైన తెలిసినదా?'

'తెలిసినది. నాకట ధనమున్నదని నవజీవన్ మెహతా యెన్న డును చెప్పలేదు. ఏకో పత్రములున్నవని చెప్పినాడు. రత్నలాలు మీాధనము నపహరించియుండవచ్చును. మీారది తీసికొనినారు.

'అది నాధనముకాదు శకుంతలా! నాకంపెనీ డబ్బు నత డెప్పు డును హరించడు, అపహరింపలేదు. నవజీవన్ మెహతా నీమిత్రుడను కొనుచున్నావు. అతడు పాపము చాల బాధల ననుభవింపవలసి యున్నాడు. నీవు మోడరన్ హోటలులోనే యున్నావుకాదూ? ఒక వేళ నవసరమున్నచో టెలిఫోను చేయుదును. రాత్రి మాయింటికి రావలసివచ్చునేమో. నీకు సాయముగ లీలకూడవచ్చును.'

'నాకు బనియున్నది. రాజాలను' అని యామె పలికినను అది వినిపించుకొనకయే యతడు వెడలిపోయినాడు.

''ఏమైనను సరే నేను వెళ్ళ' నని యామె నిశ్చయించుకొన్నది. మోడరన్ హోటలుకుబోయి యామె నిద్రాముద్రితనైనది, పదకొండు గంటలకు టెలిఫోను గంట గణగణ మ్రోగినది. ఆమె రిసీవరు నందుకొని 'అయ్యా! వినాయకరావుగారు! నాకు జాల బడలికగా నున్నది. నేనిపుడు రాజాలను, క్షమింపు' డనినది.

పది నిమిషములు గడచిన పిదప మరల గంట గణగణ మ్రోగినది.

'శకుంతలా! వెంటనే బయలుదేరి రమ్ము. లీల కూడా వచ్చి యున్నది. 304 బ్రూక్ హిధ్' అని కఠినముగ పలికిన వినాయకరావును లోన దిట్టుకొనుచు 'ఇప్పుడే వచ్చుచున్నా' నని ప్రత్యుత్తరమిచ్చి' బస్సునెక్కి బయలుదేరినది' ఆమెను లీల గుమ్మములో గలిసికొన్నది'

నిర్భయముగ నలువురును లోనికి బోయినారు. వినాయకరావు వారిని జూచి, శ్రమయిచ్చినందులకు గినియకుడు దీనికి బ్రత్యేకముగ మీరు ప్రతిఫలమొసగబడును. మీరిట నేను చూచినది విన్నది యెవరి తోను జెప్పరాదుసుడీ' యని వారల నయిదుగదుల యావలకు గొని పోయి యొక చిన్నగదిలోనున్న మంచముపై బడియున్నవానిని చూపినాడు. అతని కరచరణములు బంధింపబడియున్నవి. అతనిని చూచి శకుంతల విస్మయపరీత చేతస్కయైనది అతడెవరు? నేషనల్ బ్యాంకు మేనేజరు ఈశ్వరలాలు!

---

## ఇరువదియొకటవ ప్రకరణము

### లిఖిత వాక్యములు

వినాయకరావు ఈశ్వరలాలును చూచి 'జరిగినదంతయు నిపుడు చెప్పుము. శకుంతలా! అతడు చెప్పునది విని, నాగదిలో టైపురైటరున్నది. టైపుచేసి యిమ్ము' అనినాడు. ఈశ్వరలాలు తానుభోజనానంతరము వాహ్యాళి వెడలుట మామూలనియు. నిన్న షికారుగా వెళ్ళి వచ్చుచుండగా, బ్రూక్ వీధిలో నొకచో మువ్వురు ఆగియున్న యొక కారు చెంత పోరాడుకొనుచుండగా జూచి, తానాప బోయితిననియు, నెవరో తన్ను వెనుకనుండి కర్రతో గాబోలుగట్టిగా కొట్టిరనియు దాను స్మృతితప్పి పడిపోయితిననియు జెప్పినాడు. తాను తెలివినొందు సరికి వినాయకరావు సాధమున నుంటిననియు జెప్పెను.

'కారుమాట!'

'నేను పడిపోవుటకు ముందే కారు వెడలిపోయినది. అదిగాక నీవు మితిమీరి మాట్లాడుచున్నావు' అని యొక చీటీవచ్చినది.'

లీల తన వెంటరాగా, శకుంతల యాతని గదిలోని కేగినది. అలమారులో కాగితము జూచినది. ఆకాగితములపై నొక విలాస దండ (Hand cane) మున్నది. ఆమె యాకఱ్ఱను దీసి చూసినది. అది రక్తసిక్తమైయున్నది. శకుంతల నిర్విణ్ణయైనది. అట్లయిన ఈశ్వరలాలును వినాయకరావే యాదండముతో గొట్టి యుండునని యూహించినది. ఆమె లీల కేవిధమైన యనుమానము కలుగకుండ, కాగితముతీసి, పైవ్రుచేసి లీల చేతికిచ్చినది. ఈశ్వరలాలుచే సంతకము చేయించి, లీలచే సాక్ష్యముగ సంతకముచేయించి, వినాయకరావు 'శకుంతలా! లీలా! మీరిక వెళ్ళిపోవచ్చు' ననినాడు. శకుంతల వెంటనే హోటలునకుబోయి, డాక్టరు నవజీవన్ మెహతాను టెలిఫోనులోబిలిచి 'జరురుగా మాట్లాడవలసియున్నది రమ్ము' అనినది.

పదినిమిషములైన గాకుండ నవజీవన్ మెహతా వచ్చినాడు. శకుంతల జరిగిన దంతయు జెప్పినది 'సోమోకా మార్గమున నెవ్వరు నడ్డముగ నుండరాదు. రెండవ గ్యాంగులోని రత్నలాలు చనిపోయి నాడు. ఇక—' అని యాతడు పలికినంతనే ఆమె 'సోమోకాయెవరు? వినాయకరావేనా?' యని యడిగినది.

'ఆతడు సోమోకా ముఖ్యప్రతినిధియని నాయుద్దేశము'

ఈశ్వరలాలో—'

'అతడు నేషనల్ బ్యాంకు జనరల్ మేనేజరు. నాధనము. రత్నలాలుధనము. వినాయకరావు ధనము నతని బ్యాంకులోనే యున్నది. వినాయకరావు రేపు తన ధనము నాబ్యాంకునుండి తీసివేయునని నాయుద్దేశ' మనినాడు. డాక్టరు నవజీవన్ హామెతా? 'అధన ముందుచోటు తెలిసినచో' నని మఱల పలికి వాక్యము ముగించక విడిచినాడు;

---

# ఇరువదిరెండవ ప్రకరణము

౫౧

శకుంతల మరల ఆఫీసు ప్రారంభమైనదని లేచినది. హత్యచేసిన దెవరో యామె యెరుగును. ఈశ్వరలాలును గాయపఱచిన దెవరో తనకు బాగుగా తెలియును. వినాయకరావు కంపెనీ యుద్యోగము నుండి సాధ్యమైనంత త్వరలో విడివడవలయునని యామె తలంపు. వినాయకరావు స్వభావమామెకిపుడు తెలిసినది. బ్యాంకుపద్ధతికి వ్యతిరేకముగా ప్రవర్తించినందులకే యతఁడీశ్వరలాలును తలపై గొట్టెను. ఆమె ఆఫీసు చేరినంతనే వినాయకరావు గదిలోని గంట మ్రోగినది. ఆమె లోనికేగినది.

రాత్రి శ్రమయని తలంపక, వచ్చినందులకుఁ జాల సంతోష ముగనున్నది.

ఆమె యూరకుండినది.

'శకుంతలా! డాక్టరు నవజీవనమెహతా కర్ధరాత్రముననే ఈశ్వరలాలు వృత్తాంతమును దెలియపఱచి యుందువు అవునా!'

'కాదు. నేనాతని కలిసికోలేదు.'

'కలిసికొనిచో ప్రమాదములేదు. ఆతనితో నే మ దేవిషయములు చెప్పినావు ?'

'ఈశ్వరలాలు శిరముపై కఱ్ఱతో మీారే మోదినారనికూడ చెప్పినాను'

ఆతడు యిసుమంతైన విస్మయము కనుపఱచలేదు. 'టేబిలు మీా లెటరుపేపర్లుంచినారని తలచినాను. అయితే నేను చాలచెడ్డ

వాడనని తలచుచున్నావా?' 'అని వినాయకరావు పలుక' శకుంతల 'సామాన్యమైన దుష్టత్వముకాదు. భయంకరమైన దుష్టత్వము' అనినది.

'శకుంతలా! అంత భయంకరమైన దుష్టస్వభావము కలవాడనా? నేనందఱకును దుష్టుఁడనే. ఇదిగో మఱొకయుత్తరము వ్రాయుము' అని యిట్లు చెప్పినాడు.

'మేనేజింగు డైరక్టరు'
నేషనల్ బ్యాంకు, బొంబాయి.

అయ్యా!

నాతాలూకు మీ బ్యాంకులో నున్నధనము బొంబాయి అండ్ మహారాష్ట్రా బ్యాంకులోనున్న నాఖాతాను జమకట్టించవలెను. సేఫ్‌డిపోజిట్‌లోనున్న నాచిన్నపెట్టె యీయుత్తరము దెచ్చిన ఫెంగ్‌హాకిచ్చి, రసీదు పుచ్చుకొనవలెను.

(సం) వినాయకరావు

ఇట నిట్లుండగా వినాయకరావునుగూర్చి నవజీవన్ మెహతాయును, ఈశ్వరలాలును లేమింగ్టనుపార్కులో గూర్చుండి సంభాషించుకొనుచుండిరి. వినాయకరావుపై నవజీవనమెహతా కున్నంత యనుమానము ఈశ్వరలాలుకు లేదు. వినాయకరావు తన బ్యాంకునుండి ఖాతాను మఱొక బ్యాంకును మార్చుకొనునని నవజీవన్ మెహతా చెప్పియుండెను. తాను వినాయకరావునెడ పగఁబూనియుంటిననియు. నెట్లో యట్లు ఆపగ సాధించుకొందుననియు జెప్పి వెడలిపోయినాడు.

---

# ఇరువదిమూడవ ప్రకరణము

---

ఆ క్షే ని

'అయితే శనివారమునాడు నీవు మానివేయుట తప్పదా శకుంతలా!'

'తప్పదనియే నాయుద్దేశము'

'నామాటవినుము వచ్చేశనివారమువఱకును మానవలదు'అని వినాయకరావనినాడు తరువాత నామెమొత్తములు కైపుచేసినది. నాలుగంటలకు నొకడు 'ఇంద్రభవనమునుండి టీ గొనివచ్చినాడు అనుదినము హోటలునుండి 'టీ' రాగానే శకుంతలయేవెళ్ళి వినాయకరావుగదిలోనుంచెడిది ఆమె ప్లేటులో టీనుంచి యాతనిబల్లపై నిడినది. అతడు జేబులోనుండి నీలిరంగుకాగితముతో జుట్టబడిన యొక పొట్లమును, గులాబిరంగు కాగితమునకు జుట్టబడిన యొకపొట్లమును దీసినాడు 'అదియేమి? అట్లుపరీక్షించుచున్నారని శకుంతలయడుగ నాతడు 'ఇందువిషముకలిసినదేమో చూచుచున్నాను. ఆర్సెనిక్, స్ట్రిక్నైను, యాకొనైటు. కోనైను మున్నగునవేవైన టీలోగలుపబడినచో ప్రాణముదీయగలవు నాకివుడెల్లయెడల శత్రువులే వైద్యవృత్తిలో నొకశత్రువు' అనినాడు——

'ఎవరు? డాక్టర్ నవజీవన్ మెహతాయై యుండునా'అనియామె తలచినది. తరువాత కొన్నియుత్తరములు పార్సిలు వచ్చినవి. ఆమె యాపార్సిలుదారములు గత్తిరించినది. వినాయకరావు మెల్లగా విప్పినాడు అదియొక యాపిలు ఆఫలమునకు సుమారు నూరుసూదులు గ్రుచ్చబడియున్నవి. 'ప్రతి సూదికి విషమున్న'దని వినాయకరావు హాసమొనరించినటుల 'ఈసూదులు ఆస్త్రరాక్సు అను విషముతో నింపబడినవి'అని యాపండు నొకపెట్టెలోనుంచి తాళము వైచినాడు.

'వీని నెవరు పంపియుందురు? డాక్టరు నవజీవన్ మెహాతా కాదుకదా!' అని శకుంతల—

'అతడై యుండడు—ఏమో' యని వినాయకరా వాలోచనా ధీనుడైనాడు అతని నయనములు క్రోధారుణములైనవి 'మిమ్ము చూచినంతనే నాకు భయమగుచున్నది' అని శకుంతల పలుక 'శకుంతలా నేను భయంకరముగా నున్నాననితలంపవలయును. నీవు బి. ఏ, ప్యాసయినను లోకానుభవము చాలనిదానవు. భయంకరమైన విషయముల నిక నెన్నటినో నీవు చూడవలసి యున్నది' అనినాడు వినాయకరావు శకుంతల తనగదిలోనికి వెళ్ళిపోయినది. లీలవచ్చి 'శకుంతలా! ఫెంగ్ హో మేనేజరట' అనినది ఇంతలో వినాయకరావా డారిని పోవుచు, ఆమాట విని 'శకుంతలా! లీలా! ఫెంగ్ హో మేనేజరైనాడని మీరు భయపడనక్కఱలేదు అతనికి మీకు నెట్టిసంబంధముండదు అనినాడు.

ఇన్స్పెక్టరు చంద్రమోహాన్ వచ్చి 'అమ్మాయీ! శకుంతలా! నిన్ను మఱికొన్ని ప్రశ్న లడుగుటకు వచ్చినా' నననినాడు.

'ఇదివఱకే యర్గగినారుకదా!'

'అయినను మఱల మఱల నడుగుట పరిశోధన విశేషము ఒకసారి మఱచినది. మఱొకసారి సాక్షులు చెప్పచుందురు.'

'ఫెంగ్ హోనుకూడ ప్రశ్నించితిరా?'

'ఆహా! ఆతడు సూరతులోనుండినట్లు చక్కగా కల్పింపబడినది వినాయకరావు ఉన్నాడా!

'లేరు.'

'గదిచాల చక్కగా ఉన్నది. క్రిందకానిస్టబులుఉన్నాడు. అతని నిటకు రమ్మందురా అమ్మాయీ!'

'దయయుంచి మీరు యీవలకు వచ్చినచో నేను వెళ్ళి తెలుసుకొనివచ్చెదను.'

'అబ్బో! గట్టిదానవే. అయితే నాదగ్గఅవారంటున్నది' అని చంద్రమోహన్ యొక కాగితముచూపినాడు ఇంతలో వినాయకరావు వచ్చి 'సెర్చివారంటా! వచ్చి వెదకికొనుము' అని చంద్రమోహన్ వంక చూచినాడు చంద్రమోహన్ 'వినాయకరావుజీ! ఈశ్వరలాలుబ్యాంకరు నెవరుకొట్టినారు?' అనియడిగినాడు——

'ఏమో ఎవరుకొట్టినారు?'

'నల్లమందుమున్నగుమత్తుమందుల నెగుమతిచేయు రెండుకంపెనిల యజమానులలో నొకకంపెనీవారికి ఈశ్వరలాలేదో యపకారము చేసియుండునని నాయుద్దేశము——'

'ఉహూ!'

'వినాయకరావు! నీవు హిందూదేశమంతయు తిరిగియుందువు. సోమోకా నెచటనైన చూచినావా——'

'చూచినాను——నీవో——'

'లేదు ఆతనికంపెనీ యీమత్తుమందులవ్యాపారములలో నపారముగ లాభమార్జించుచున్నారు. అవర్తకము నెట్లయిన నాపవలయును కాని వినాయకరావు! మంచి గడుసుకైపిస్టుగరలును సంపాదించినావు ఆమె వారంటుచూపినను, నీవురాకుండ గదివెదకుటకు వీలులేదన్నది. ఫెంగ్ హోపై ననుమానము లేదు?'

'అయితే శకుంతలపై నున్నదా?'

'రత్నలాలు హత్యకుబూర్వ మాతనిగదిలో టేబిలుమీదనున్న విస్కీసీసాలలో నొకదానిలో రెండుఔన్సుల 'అఫీని' యున్నది. ఆమెయే యాసీసాలో నానల్లమందుద్రావకమును రహస్యముగనుంచెనని

నిర్ధారణమైనచో చిక్కే, ఆసాయంకాలమునుండి రత్నలాలు మితి తప్పి త్రాగుచుండెను. నేనుపోయివచ్చెదను'

'క్రొత్తవిశేషము—అభిని! అనుకొనినాడు వినాయకరావు తనలోదానే.'

---

## ఇరువదినాల్గవ ప్రకరణము

[illegible]

నాటిసాయంకాలము లేఖలనన్నిటిని పైపుచేసి, శకుంతలసంతకమునిత్తము వినాయకరావు గదిలోనికేగినది. అట 'ఫెంగ్‌హో! రత్నలాలును నీవు చంపినావా?' యను ప్రశ్న వెలువడినది.

'అమ్మాయీ నాతండ్రిని చిత్రవధగావించిన యొకచైనావానిని దప్ప నేనెవ్వరిని చంపుట యటుంచి, కొట్టనైనను గొట్టలేదు.

'ఫెంగ్‌హో! ఎందులకడిగినానో నాకే తెలియదు. క్షమింపుము'

'అడుగవలసినదే హత్య జగిరినపుడు ఫెంగ్‌హో యాగదిలో నుండుట నీవు చూచినావుగదా?' అని వినాయకరావడుగ 'అవును, చూచినానని శకుంతల పలికినది.

'ఆతడు వెడలిపోయి మీతో చెప్పినాడు మీరు వచ్చినారు' అని మరల వాకుచ్చినంతనే 'శకుంతలా! పంటినొప్పికి అభిని కంటె మంచిమందు లెన్నోయున్నవినుమా' యనినాడు వినాయకరావు.

,అభినియా? నేనెప్పుడును చూడలేదు—వినలేదు' దని యామె తెల్లబోయినది.

'రేపే కదా నీవు వెడలిపోవునది' అని నాడు వినాయకరావు.

శనివారమునాటి యుదయమున శకుంతల ఆఫీసు గదిలో కూర్చుండియుండగా నౌకరు కుఱ్ఱవాడువచ్చి కవరునిచ్చినాడు. అందులో నామె తనకు రావలసిన జీత మెనుబదిరూపాయలును రాత్రి వచ్చినందుల కదనముగా బదిరూపాయలును మొత్తము తొంబది రూపాయలున్నవి. బదిరూపాయలు అదనముగా నీయకపోయినచో బాగుండియుండునని యామె తలచినది. కారణముమాత్ర మామెకే తెలియదు. ఒంటిగంట యైనది. నాడు ఆఫీసు ఒంటిగంటకే మూయుదురు. వినాయకరావుతో జెప్పి వెడలిపోవుట మంచిది. శకుంతల యాతని గదిలోనికి వెళ్ళినది. ఆమెనుజూచి యాతడిట్లు ప్రశ్నించినాడు.

'ఏమి?'

'నేను వెళ్ళుచున్నాను—'

'నేట్‌లో హారుమల్లుకు జవాబు వ్రాయవలసిన దెప్పుడు?'

'సోమవారము—'

'ఆనాడు తప్పక జ్ఞాపకముచేయుము—'

'జ్ఞప్తికిదెచ్చుటకు నేనుండినగదా! నేను నేడే వెడలిపోవుచున్నానని మీకు దెలియునుగదా?'

'ఆహా! అలాగునా? మీ కేసు విచారణయెప్పుడు?'

'సోమవారము—'

'సరే రాబోవు శనివారమువఱకు బనిచేయుము.'

'నాకు బనియున్నది—'

'వీలులేదు. ఈవారమురోజులుకూడ పనిచేయవలసినదే—'

ఏలనో కాని ఆమె యతనిపలుకున కెదురాడ లేకపోయినది. సోమవారమునాడు కోర్టుకువెళ్ళి సాక్ష్యమిచ్చి యామె నాల్గుగంటలకు

బదినిమిషము లున్నదనగా అక్కసుచేరినది. ఆతడు తేనీరు త్రాగుచు 'ఏమైనది?' అని యడుగ మజిల వాయిదాపడినది. అని బదులు పలికినది.

'నవజీవన్ మెహతాకూడ వచ్చినాడా?'

'ఆతడు నాకు గాన్పించలేదు.'

'పంటినొప్పికి నల్లమందేలనని నేనన్నమాట చెప్పలేదుకదా?'

'నాకు బోధపడలేదు. ఎందులకు జెప్పవలయును?'

నేనైనచో జెప్పను. అయితే శకుంతలా! ఇంకను నీవు హోటలులోనే యున్నావా?'

'లేదు. ఒక స్నేహితురాలి యింట నొక వారము దినములుండి' యేదైన యిల్లు చూచుకొందును. నేను రత్నలాలు గృహమున నున్న సామగ్రిని గొంపోవలయును. లాయరు లారిని సామగ్రి వేలము వేయుదురట. వీలు ప్రకారము వారు ప్రవర్తింతురు.'

'సరే నీవిపుడేపోయి నీసామగ్రి తెచ్చుకొనుము' డాక్టరునకు గూడ నిది తెలియునా?

'ఆ! తెలియును' అని శకుంతల వెడలిపోయినది. రత్నలాలు పరిచారక లామె సామగ్రిని కారులో సర్దిరి. ఒకబీరువా యామెకు మిక్కిలి ముఖ్యమైనది. ఆబీరువాలో నయిదు అరలున్నవి. మూడు అరలు తెఱువబడినవి. అందులో నామె తన దుస్తుల నుంచుకొనినది ఆబీరువాను రేడియో యంత్రమును దీసికొని బండిలోనుంచి శకుంతల దుఃఖబాష్పాకులనయనలైయున్న పరిచారికలు సాగనంప కోలాబాలో నున్న మనోరమాదేవి సౌధమునకు వెడలిపోయినది.

## ఇరువదియైదవ ప్రకరణము

### రింగ్లే అండ్ కంపెనీ

డాక్టరు నవజీవన్ మెహాతా, మనోరమాదేవి సౌధమున వరండాలో నిలిచి, ఈశ్వరలాలు బ్యాంకరు రాకకై వేచియుండెను. మనోరమాదేవి, భర్తయొక్క యాత్రమును గమనించి 'ఎందులకంత తొందర! ఆతడు రాకపోడు' అనినది. శకుంతల తనకా సౌధమున నిర్ణయింపబడిన గదిలో దన సామగ్రి సర్దుకొనినది. ఆమెవచ్చి వారితో సంభాషణ కుపక్రమించినది. 'నాతో మాట్లాడుటకు ఈశ్వరలాలు బ్యాంకరు వచ్చును' అనినాడు. ఆత డెవరో శకుంతలకు వెంటనే స్ఫురింపకపోలేదు. ఎనిమిదిన్నరకు ఈశ్వరలాలు వచ్చినాడు. నవజీవన్ మెహతా, ఆ బ్యాంకరుకు విందున కాహ్వానించెను. శకుంతల యుత్సాహముగాలేదు. మనోరమాదేవి తన వదినె యని డాక్టరు ఈశ్వరలాలుతో జెప్పినాడు. మనోరమాదేవికి గూడ నావిందు సంతోషజనకము కాలేదు.

డాక్టరు! అనుకొన్నంత జరిగినది. ఒకవ్యక్తి నేడు మన బ్యాంకులో దన ఎక్కౌంటు తీసివేసినాడు.

'అహా! నేను నట్లేతలచినాను. ఈశ్వరలాలు! ఆతడాపెట్టెను గూడ గొంపోయినాడా?'

'కొనిపోయినాడు. నా హృదయమిపుడు నిశ్చింతమైనది'

మనోరమాదేవివచ్చి, తననాథు నుద్దేశించి, 'నీకొఱకు ఇన్స్పెక్టరు చంద్రమోహన్ వచ్చినాడు' అనినది. ఈశ్వరలాలు చంద్రమోహనునకు గాన్పించుటకు సమ్మతి నీయకపోవుటచే మనోరమాదేవి యాతనిని దన ఫొటోలు చూచుటకు రమ్మని గొంపోయినది

శకుంతలకూడ వారితో నేగినది. ఇన్స్పెక్టరు లోనికివచ్చి యొక కుర్చీపై గూర్చుండి 'డాక్టరు! అసమయమున వచ్చినానని అన్యథా తలపకుము. రత్నలాలు సౌధమున కీవలనున్న పార్కు లో నొక పొదలో నీహ్యాటము కనబడినది. ఇందులో నాలుగు డ్రాముల నల్లమందు ఉన్నది. రింగ్రోఫే అండ్ కంపెనీవారి షాపులో రత్నలాలు హత్యజరిగిన దినమున నీవే కొన్నట్లు వ్రాయబడియున్న ది. రత్నలాలుత్రాగిన విస్కీసీసాలలో నొక దానిలో నీయభినియు న్నది. రత్నలాలు హృదయమున నల్లమందున్నదని డాక్టరులచే కను గొనబడినను, నాకోరిక చొప్పున యామాట పైకిరాకుండ అవుచేయ బడినది. దీనికి దగిన సమాధానము నాలోచించుకొని తెలుపుము. లేనిచో హత్యాపరాధము నీపై మోపవలసియుండు' ననినాడు. నవజీవన్ మెహతా నిశ్చేష్టుడై యట్లే కూర్చుండిపోయినాడు.

---

## ఇరువదియారవ ప్రకరణము

"ప్రేమ"

'నిజమే. నేనే యీ 'టింక్చరు ఆఫ్ ఓపియము' (Ti ncture of Opium) రింగ్రోఫే కంపెనీలో కొనినాను' అని డాక్టరు నవజీవన్ మెహతా ఇన్స్పెక్టరు చంద్రమోహన్తో ననినాడు.

'రత్నలాలు కొఱకేనా !'

'అవును. అతడు నిద్రలేమివ్యాధి (Insomina) చే బాధ పడుచున్నందున నీటింక్చరుఆఫ్ఓపియము వాడుమనిసలహానిచ్చినాను'

అట్లయిన అతడే విస్కీసీసాలో నల్లమందు బడవైచుకొని త్రాగెననినీయభిప్రాయమా'?

'నాయభిప్రాయమేదో యిప్పుడు తెలుపజాలను. రత్నలాలు హత్యజరిగిన నాటిరాత్రి తొమ్మిదిగంటలకు టెలిఫోనులో నాతనితో మాట్లాడిన విషయము నీవేల కోర్టులో జెప్పలేదు?'

'డాక్టర్! అది యనవసరము. ఆ రాత్రి ఎనిమిదిగంటలవరకు నీవు రత్నలాలు పోషకుడవని, ఆతనిగదిలోనున్న విషయముకూడ దాచ బడినది తెలియునా?'

'అవును. శకుంతలతో నున్నాను.'

'అదే శకుంతల నిన్ను ఆతని గదిలో విడిచి, మేడమీదకు బోయి, పదినిమిషములవరకు దిరిగి రాలేదు. అదిగాక ఆతడు మద్య పానము చేయునని నీకు బాగ్గా దెలియును. మత్తుమందుల వ్యాపా రములో నీకునురత్నలాలుకును సమానమైన సంబంధమున్నది. ఆతడు నన్ను తొమ్మిదిగంటలకు గలిసికొనునని నీవెట్లో తెలిసికొని, నాతో నేదైన జెప్పుకొనునేమోయని యట్లుచేసియుందువు. అదిరత్నలాలుకు నౌషధప్రాయముగ నిచ్చియున్నచో నీ 'ప్రిస్క్రిప్షను' పుస్తకములో గూడ నుండియుండవలయును. నన్ను నిష్ఠూరమాడవలదు. వృత్తిని బట్టి—విధ్యుక్తధర్మమగుటచే నిట్టివే పెక్కువిచారకర వృత్తాంతము లను దెలిసికొనుచుండవలయును. 'గుడ్ నైట్' అని చంద్రమోహన వెడలిపోయినాడు. ఆతనిముఖమున కత్తివాటువైచినరక్తము రానంత వెల్లదనము నొందియున్నది. తానానాడా నల్లమందును పార్కులో నేల బడవైచితినా యని మెహతా తన తెలివిహీనతను నిందించు కొనెను. అది ప్రిస్క్రిప్షన్ బుక్కులో వ్రాయుట మంచిదని తలచి నాడు. అయిదునిమిషములైనది. నవజీవన్ మెహతా, ఈశ్వరలాలు, శకుంతల, మనోరమాదేవి యున్నగదిలోనికి బోయినాడు. శకుంతల పియానో వాయించసాగినది. ఈశ్వరలాలు వాద్యము ముగిసిన పిదప

'నాచిత్తము నిర్భరానంద వివశమైనది. నాకెప్పుడు శాంతియే కావలయును. నాజీవితమే శాంతిమయము. తుదకు నాయినుపపెట్టె తెఱచుటకుకూడి శాంతి అని యర్థమిచ్చు 'పీస్' 'Peace' అను పదమునుండి ఒక్క అక్షరము తొలగించి 'పేస్ (Pace) అని ఏర్పఱచినాను. పదిన్నర దాటినది. రేపు మీరు నాయింటికి భోజనమునకు రాగోరెదను.' అని వెడలిపోయినాడు. ఆతనిని సాగనంపి' డాక్టరు నవజీవన్ మెహతా లోనికి వచ్చిన పిదప శకుంతల 'నవజీవన్! నీవు భాగ్యవంతుడవేనా?' యని ప్రశ్నించినది.

'ఏమి? అట్లడుగుచున్నావు. వారముదినములలో నయిదులక్షల డెబ్బదియాఱు వేలరూపాయల భాగ్యమున కధికారి నగుదును.'

ఆసంఖ్యనే యాతడు ఇండియన్ ట్రేడింగుకంపెనీ ఆఫీసులోని యినుపమందసమున లభించినకాగితముపై జూచినాడు. ఒకసారి వినాయకరావుగది శోధించినచో నాధనమెచ్చటనున్నదో తెలియునని నవజీవన్ మెహతా తలపోసినాడు. మనోరమాదేవివచ్చి 'పేస్' అనగా నేమియని యడిగినది.

---

## ఇరువదియేడవ ప్రకరణము

---

### బ్యాంకుఖాతాదారు

శకుంతలఆఫీసునకుబోవుసరికి వినాయకరావుయింకనువచ్చియుండలేదు. అతడు వచ్చునప్పటికి బదునొకండుగంటలైనది. ఆతనివదనమున విసుగు ప్రస్ఫుటమగుచుండుట నామె చూడకపోలేదు. అతడు ఫెంగ్ హోమునిలిచి తీవ్రమగుస్వరముతో నేదోచైనాభాషలోమాట్లాడుటకూడనామెవినకపోలేదు. వంద్రెండున్నరకాతనిగదిలోని శేబిలుపై

నున్నగంట మ్రోగినంతనే శకుంతల నోటుబుక్కు తీసికొనివెళ్ళినది. వినాయకరా విల్లనినాడు—

'శకుంతలా! నీవుమనోరమా దేవియింటిలోనున్నావు కాదూ?

'అవును. ఆ మెమటుది నవజీవన్ చిరకాలమునుండి పరిచితుడు'

'పరిచితుడు...స్నేహితుడు...కాని శకుంతలా! నేనొకయుత్తరము వ్రాసియిచ్చెద'నని ఎనిమిదిపంక్తి లోకకాగితముపై వ్రాసి కవరులోనుంచి 'ప్రయివేటు—డాక్టరు నవజీవన్ మెహతా ప్రిన్సెసువీధి బొంబాయి' అని వ్రాసి, 'ఈయుత్తరము పగలు నీహ్యాండుబ్యాగ్ లోను, రాత్రులందు తలగడాక్రిందనుంచుకొనుచుండుము—నీకాతడు స్నేహితుడేకాని యొకవేళ నవసరమువచ్చి—అతడు నిన్నుబాధించుచో యీయుత్తరము చూపుము వ్యతిరేకము చెప్పవలదు. నేను చెప్పినట్లుచేయు' మనినాడు.

ఆమె కది యిష్టము లేకపోయినను 'సరే' యని ఆకవరును స్వీకరించినది. ఇంతలో నొకడువచ్చి కేబిలుగ్రామునిచ్చినాడు—అందిట్లున్నది.

'బొంబే క్రేడింగుకార్పొరేషను—

బొంబాయి—

రంగూనులో నరెస్టయినఏజంటు చండీదాసు విడుదల చేయబడినాడు. అతడు 'రోమియో' స్టీమరుమీద బొంబాయికి బయలుదేరినాడు—

పోలీసుసూపరింటెండెంటు,

కెల్లీ.

ఆసమాచారమును శకుంతల చదివినది.

'ఈసమాచారము ఒకవ్యక్తికి చాలకష్టముకలిగించును, సరే నీవిక వెళ్ళవచ్చును.'

* * * *

దాదరులోనేయున్న ఈశ్వరులాలు బ్యాంకరు సౌధము మిక్కిలి రమణీయమైనది. మిక్కిలి ఖరీదుగలకుర్చీలు, బల్లలు, సోఫాలు కలిగి పరిశుభ్రత—సౌభాగ్యము మూర్తీభవించినవో యనునట్లుండును. ఆతడు వంటలవాడగు లల్లూభాయినిపిలిచి 'నేటిరాత్రి ముగ్వురు మిత్రులు భోజనమునకువత్తురు. పరోటాలు, బంగాళాదుంపకూర, జిలాబీ, హాల్వా, కూల్‌డ్రింక్సు అన్నియు దయారుచేయుము. సరిగా రాత్రి ఎనిమిదిన్నర గంటలకు వత్తురు. ఏలోపమును రానీయవల'' దనినాడు.

పదిన్నరకు గుమస్తావచ్చి విజిటింగుకార్డు నిచ్చినాఁడు. దాని పైన 'మేజరు వినాయకరావు డి. యస్. జీ.' అని యున్నది. బల్లపై నున్న యుత్తరములు డ్రాయరులోనుంచి, 'రమ్మను' మనినాడు. వినాయకరావు వచ్చి కూర్చుండినాడు—

'నిన్న నాఖాతా మీబ్యాంకునుండి తీసివేసినాను.'

'అవును తెలిసినది. నాహృదయమునుండి ఏదోభారము తీసి వేసినట్లయినది.'

'ఆహా! నాస్వభావము మంచిది కాదను తలంపుతోనే నీవట్లు పలుకుచున్నావని నాయుద్దేశము. మీ బ్యాంకులో జరుగుచున్న తప్పు పనుల సవరించుటకే—నేను ఎకౌంటునుంచినాను.'

''తప్పుపనులా?'

'అవును. ఆతప్పులు సామాన్యమైనవికావు. వాని నన్నిటిని తెలిసికొన్ననాడే మీబ్యాంకులో పెద్ద మొత్తముంచుట శ్రేయస్క-

రము కాదని తలచి తొలగించితిని. ఈశ్వరలాలు! ప్రేమచంద్రు జీవాజీ యెవరు?' అని ప్రశ్నించి ఈశ్వరలాలు ముఖము వెల్లదనము నొందుట చూచి 'స్నేహితుడా! నీబ్యాంకులో ప్రేమచంద్రు జీవాజీ అను ఖాతాదారు నాకంటె యెక్కువ మొత్తమునుంచి వ్యాపారము చేయుచున్నాడు. నాసొమ్ముండుటవలన నీబ్యాంకునకు నష్టములేదు గాని ప్రేమచంద్రు ఖాతామాత్రము మిక్కిలి ప్రమాదకరమైనదని యెఱుంగుము. నీబ్యాంకును దివాలాతీయించుటయేగాక నిన్ను కారాగృహమునకు కూడ పంపగల ఖాతాదారాతడు.'

'అయ్యా! వినాయకరావు, బ్యాంకువ్యవహారముల మాట్లాడ వలదు. నేనెఱుగుదును మీఆఫీసులో పనిచేయు యువతిని గూర్చి యెఱుగుదును. ఆమె చాల మంచిది. మీరు వెళ్ళిపోవచ్చు'నని గంట నొక్కినాడు—

'యువతియా? నా ఆఫీసులో నున్నదా?' యనుచు వినాయకరావు తడబడినాడు—

---

# ఇరువదియొనిమిదవ ప్రకరణము

చెక్కు

'అట్లయిన ప్రేమచంద్రు జీవాజీ యను పేరుతో మీబ్యాంకులో ఖాతా నుంచినది శకుంతలయేనా? నిజమా?'

'వినాయకరావు క్షమించి నన్ను బ్యాంకు విషయము లడుగ వలదు వెడలిపొమ్ము.'

ఆతడు లేచి 'ఈశ్వరలాల్! చెక్కుల సంతకము చేయు చున్నది. శకుంతలకాదు. నీవసత్యమాడుచున్నావు. గానిచో నిన్నె మఱెవరో మోసము చేయుచుండి యుండవలయును.'

'ఏమో నేనేమియు జెప్పను.'

'సరే' యని వినాయకరావు వెడలిపోయిన పిదప ఈశ్వరలాలు గుమాస్తాను బిలిచి చిఠా తెప్పించి ప్రేమచందు ఖాతా పరికించినాడు. 'అంగోరా నూనె ధర యెట్లున్నదని ఈశ్వరలాలు ప్రశ్నింప గుమాస్తా 56 నుండి 37 కు తగ్గిపోయినదనినాడు—

'సరే. ఆతని నొకసారి కలిసి కొనుమందును.'

'ఆతని నిదివఱకు జూడలేదా?'

'లేదు. ఈసంతకములన్నియు నెవరో స్త్రీ చేసినట్లు తోచు చున్నది. ఇరువదియైదువేల రూపాయలకు చెక్కువచ్చినది. ఏబది రూపాయలు తక్కువగా అతని ఖాతాలో నిల్వయున్నది. ఏమిచేయు మందురు.'

'పొమ్ము నిమ్ము' అని కుర్చీలో జేరగిలబడి ఈశ్వరలా లాలో చనా ధీనుడైనాడు.

---

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము

### ఠీం!

సిటీపోలీసుస్టేషనులో గూర్చుండిన సూపరింటెండెంటు విల్లీ ఇన్‌స్పెక్టరుచంద్రమోహాను నుద్దేశించి 'రంగూనులో నరెస్టుచేయబడి విడుదలయై వచ్చుచున్న చండీదాసువలన ప్రయోజనకరమైన వృత్తాం తమేమైన లభించునా? వినాయకరావు సోదెమోకాయని ఋజువుచేయ దగిన నిదర్శనముల నేమైన సంపాదించినావా? డాక్టరునవజీవన్ మోహ

తాకు గూడ నీ మత్తుమందుల వ్యాపారములో సంబంధ మున్నదా?' అని యడిగినాడు——

'సార్! హత్యతో సంబంధము లేకపోయినను వినాయకరావు నకు మత్తుమందుల వ్యాపారములో సంబంధమున్నది. నవజీవన్ మెహతాకుగూడ సంబంధము లేకపోలేదు.'

ఇంతలో కానిస్టబిలువచ్చి చండీదాసును రంగూనునుండి అతని ననుసరించివచ్చిన షేకీప్ ఖాన్ అను సి. ఐ. డి యిన్‌స్పెక్టరును వచ్చినారని చెప్పినాడు.

చండీదాసు సూపరింటెండెంటును జూచి యిట్లు చెప్పినాడు.

'రత్నలాలుకు మత్తుమందుల వ్యాపారములో జాల సంబంధ మున్నది. నేనాతని కొకసారి అయిదు అరల బీరువనిండుగ కొకెయిను నమర్చి, సప్లయిచేసినాను. అది రత్నలాలు సౌధమున నేయుండును. సోయోకాకు ముఖ్యప్రతినిధి యెవరో నేనెరుగను.'

'సరే మిమ్ము విడిచిపుచ్చెదను. మీరిక వెళ్ళిపోవచ్చు'నని సూపరింటెండెంటు పలుక, చంద్రమోహన్ లేచి 'మిస్టర్! నాతో రమ్ము' అని సమీపములోనున్న 'ఆర్యభవన్' రెస్టరెంటుకు గొంపోయి, 'ఫలహారములు—టీ' లిప్పించి గౌరవించి, 'మిత్రమా! నీవు మాకేమియు నిక చెప్పనక్కరలేదు. ఒక్క నవజీవన్ మెహతా...' అని యూరకుండినాడు——

'డాక్టరు నవజీవన్ మెహతాయేనా? అతడు ప్రేమచందు జీవాజీ పినతండ్రికుమారుడు కాదూ?

'ప్రేమచందా' అని యిన్‌స్పెక్టరు చంద్రమోహన్ నిర్విణ్ణుడైనాడు అది చండీదాసు కనిపెట్టినాడు నగరమును జూడబోయెద నని చెప్పి చండీదాసు వెడలిపోయినాడు చంద్రమోహన్ తిన్నగా నవజీ

వన్ మెహతా సౌధమునకుబోయి తలుపు తట్టినాడు డాక్టరుతో నతడు లోనికిబోయి 'మిస్టర్ మెహతా! ప్రిస్క్రిప్షన్ బుక్కుకొరకు రాలేదు భయపడకుము కొన్ని వివరములు తెలిసికొనుటకు వచ్చినాను రత్నలాలు సామగ్రిలో అయిదుఅరల బీరువా నల్లనిరంగుగలది యున్నదా అని యడిగినాడు——

'లేదు. నాకుజ్ఞప్తిలేదు? ఏమి?'

'ఏమియులేదు. దానియడుగు భాగము మరలతోనింపి, రహస్యముగ నీయదగినదై యున్నది. ఆయరలలో రత్నలాలేదైన దాచి యుండవచ్చును.'

'నాకు జ్ఞప్తిలేదు నిజము చెప్పుచున్నా' నని, తన యావేశము నణచుకొని డాక్టరు పలుక, చంద్రమోహన్ వెడలిపోయినాడు ఆబీరువా యరలలో నయిదులక్షల డెబ్బది యాఱువేలరూప్యములు నుండ వచ్చునని యతని యుద్దేశము ఒకవేళ ఈశ్వరలాలు బ్యాంకులో దాచుకొన్నది వినాయకరావు స్వంతధనమై యుండవచ్చును. ఆధనమా యరలలో నుండుటయే సత్యమగునేని, తనకిక నేమిలోటు? అతడు శకుంతలను బిలిచి 'రత్నలాలు సామగ్రిలో నల్లరంగుగల అయిదుఅరల బీరువాయున్నదా?' అని యడిగినాడు.

'ఏమి? ఎందులకు? అది నాగదిలో నున్నది మొదటి మూడు అరలలోను నాదుస్తులు సర్దుకొనినాను——'

'ఆబీరువాను రత్నలాలు నాకొకప్పుడిచ్చెదనని చెప్పినాడు——'

'వలయుచో నది నీకిచ్చెదను. రెండు అరలు తెరచుటకుశక్యముగాకున్నది. నాదుస్తుల నుంచుకొనుట కట్టిదే మరియొక బీరువా నాకీయవలయును'

'అట్లే యిచ్చెదను'

ఆతనికి ఆబేరువా నాతణమే ప్రిన్సెసుపేఢిలోని తన సౌధము
కు గొనిపోవలయునని యున్నది. గాని ఆమె యనుమానపడునని
న యారాటమును ఆవేశమును అణచుకొని 'దానిలో రత్నలాలు
వో మత్తుపదార్థముల నుంచి యుండవచ్చును. నేనువచ్చువఱకును;
రెండు అరలును తీయుటకు బ్రయత్నించకుము' అని వెడలి
పోయినాడు.

ఆరాత్రి ఎనిమిదిగంటల పదునైదు నిమిషములకు శాస్త్రరు నవ
జీవన్ మెహతా, మనోరమాదేవి, శకుంతలకారులో ఈశ్వరలాలు
బ్యాంకరు సౌధమునకు భోజనమునకు వెడలిరి. సౌధమత్యంత రమ
ణీయముగ నున్నదని మనోరమాదేవి యంగీకరించినది. భోజన
ములో నత్యంత రుచ్యములైన పదార్థములు వడ్డింపబడినను వారిలో
నెవరికి సంతోషము కలుగలేదు. మేడయొక్క రామణీయకత
చూచుటకై, లీలయు, శకుంతలయు పైకిపోయిరి. లీల మేడమీద
నొక గదిలో పఠము వెనుకనున్న యినుపమందసమునుజూచి, వెను
వెంటనే (Pace) అను సాంకేతికపదమును జ్ఞప్తికి దెచ్చుకొనినది.
ఆమెలో నడగియున్న చౌర్యపుబుద్ధి విజృంభించినది. వెనువెంటనే
తన కడనున్న కాంబినేషన్‌లాక్ సహాయ్యమున నాయినుపమంద
సము తెఱచుట కుద్యుక్తయై, 'శకుంతలా' నీవు క్రిందకు బోయి యుం
డుము. నవజీవన్ నిన్ను పిలుచుచున్నాడు' అనినది శకుంతల దిగి
నంతనే యామె మందసము దెఱచి, బంగారపు సిగరెట్ కేసును
వెంటనే తన హ్యాండ్‌బ్యాగ్‌లో బడవైచుకొని, మందసము మూసి
వైచి, వెడలిపోయినది. అటనుండి వారు 'ఎంపైర్ వెరైటీ అండ్
డ్యాన్సుహాలు' నకు బోయిరి. ముప్వురును టిక్కెట్లుకొని, బాల్కా
నీపై కూర్చుండిరి. స్టేజిమీద నొకయువతి కూర్చుండి పాటపాడు
చున్నది. ఆమెప్రక్క నొక నలుబదియైదు వత్సరముల ప్రాయము

గల మనుజుడు పేముకుర్చీలో కూర్చునియున్నాడు. ఆయువతి మిక్కిలి విలువైన చీర ధరించియున్నది. ఆమె కర్ణములకున్న వజ్రపు కమలములు, లోలకులలో సమర్పబడియున్న కెంపులు ధగద్ధగాయమానముగ బ్రకాశించుచున్నవి. ఆమె కంఠసీమనున్న రత్నహారము కూడ విద్యుద్దీపకాంతిలో మిలమిల మెఱయుచున్నది. ఆమె ముఖము సుపరిచితముగనే తోచినది. శకుంతల యామెను గుర్తించి, 'నేను చూచుచున్నది నిజమా? కలయా'యని యోచించినది. ఆమెలీల!

---

## ముప్పదియవ ప్రకరణము

### వినాయకరావు హెచ్చరిక

లీల తన స్నేహితురాలు లీల! తనవలెనే అరువది డెబ్బది రూపాయలు సంపాదించుకొనుచున్న లీల కట్టి వస్త్రాభరణము లెక్కడివి? ఆమె జనకుడు భాగ్యశాలియా? ఆమె వదనమున దోచిన యాశ్చర్యమును గాంచి, నవజీన్ మహతా 'ఆమెను నీవెఱుగుదువు గదా!' అనినాడు.

'అవు' నన్నది శకుంతల మనోరమాదేవి భర్త నుద్దేశించి 'ఆమెకు సమీపముగా వెళ్ళిచూచి వత్తము' అన్నది. అతడును ఆమెయు క్రిందకు దిగి వెళ్ళుచు కాఫీత్రాగుటకు శకుంతలనురమ్మనిరి. ఆమె రానని చెప్పినది. వారు వెడలిపోయిన పిదప, శకుంతల యొక దీర్ఘనిశ్వాసము విడిచి యటునిటు చూచినది. ఒకమూల స్తంభము వెనుకనున్న కుర్చీలోగూర్చుండిన వినాయకరావు నామెచూచినది. అతడు లేచివచ్చి శకుంతలప్రక్కనున్న కుర్చీలోగూర్చుండినాడు. 'శకుంతలా! ఆమెలీలగదా' అరువదిరూపాయల జీతమైనను, ఆఖువేలకు

దక్కువ విలువచేయని వజ్రాభరణము లామె శరీరమున నున్నవి' అనినాడు——

'ఆమె తండ్రి భాగ్యశాలియేమో' అనినదామె!

'మనోరమాదేవి ఆమె మఱది, అని మఱల పల్కినదామె.

'మఱది కాదు. భర్తయే. నీతో వదినె-మఱది యని చెప్పినారా?'

'అవును.'

'శకుంతలా! మనోరమకు రెండు దుర్గుణము లున్నవి. దొంగతనముచేయుట ఆమె స్వభావము నీవస్తువులెవ్వియు నపహృతము కాలేదు గద! లీల ప్రక్కనున్న యతడామెతండ్రి. శకుంతలా! వారి యింటి కొకసారి వెళ్ళిరమ్ము. విశాలమైన ఆవరణ ఎన్నోపూల మొక్కలు ఒకగారేజి తప్పక చూచిరమ్ము'

'వారికి కారున్నదా?'

'ఉండి యుండవచ్చును. నేనొకసారి చూచినాను. శకుంతలా! మఱొకమాట. రత్నలాలు సామగ్రిలో నయిదుఅరల నల్లరంగు బీరువా యున్నదా?'

'అది యేమి! ఇదివఱలో నొకరప్పుడే ఆప్రశ్న నడిగినారు. మీకెట్లు తెలిసినది? ఆబీరువాలో నేమివిచిత్రమున్నది?'

'నే నొకడను. రెండవారు ఎవరు? నవజీవన్ మెహతాయా?'

'అవును.'

'శకుంతలా! తురకు ప్రళయము వచ్చినను సరియే, ఆబీరువా నెవ్వరికిని యీయకుము. ఎవరిని దెఱువనీయకుము. అదిగో డాక్టరు వచ్చుచున్నాడు.

'నవజీవన్ మెహతా వచ్చినాడు. వినాయకరావు దంపతులకు గుడ్ నైటు' అనినాడు. డాక్టరు నవజీవన్ మెహతా పెదవి కఱచుకొని నాడు. డ్యాన్సులు ముగిసిన పిదప వినాయకరావు వెడలిపోయినాడు.

'అల్లాయిన రాణికు మనోరమయు నేనును భార్యాభర్తలమని చెప్పినాడా శకుంతలా! దానికి కారణము లేకపోలేదు. నీకుదరువాత చెప్పెద' ననినాడు. తనతో నతడసత్యమేల చెప్పవలయునని శకుంతల సంశయించినది—

---

## ముప్పదియొకటవ ప్రకరణము.

'సంవరవంవరరౌయొకనేమి?'

వినాయకరావు ఎంపైర్ వెరైటీ అండ్ డ్యాన్సింగుహాలు' నుండి యీవలకు వచ్చుసరికి వర్షమారంభమైనది. కారేదైన నద్దెకు దొరకునేమోయని యాతడు చూచినాడు. ఏదియుఁ గానరానందున వినాయకరావు వర్షమును లెక్కచేయక నడిచిపోసాగినాడు. అతడు బ్రూక్ వీధి కరమైలు దూరములో నుండగా దన్నెవరో యనుసరించి వచ్చుచున్న ట్లనుమానము తోచినది. అంతలో నొక కారు రాగా ఆకారు నాపి వినాయకరావు లోనికెక్కి తలుపు వేయుసరికి వెనుక నుండి ముఖమునకు నల్లని సిల్కుజేబురుమాలు కట్టికొనిన వ్యక్తి యొకడు వచ్చినాడు అతని నేత్రములు మాత్రము కాన్పించుటకు దగిన రంధ్రము లున్నవి వినాయకరావు తటాలున రివాల్వరు తీసి, యాతనికి జూపి 'ప్రేమచందు జీవాజీ! జాగ్రత!' అనినాడు—

'ప్రేమచందెవరో కాని వినాయకరావు! నామార్గమున కీవు నిరోధముగనున్నావు జాగ్రత!'

'అట్టే హెచ్చుగా—మితిమీరాజ్ సంభాషింపకుము. రివాల్వరు ప్రేలి నిన్ను జనరల్ ఆస్పత్రిలో బడవేయవలసిన శ్రమగలిగింపకుము.

'సరే. విను. ప్రేమచం దెవరో నేనెఱుగను గాని నీవెవరో నాకు తెలియును; నీస్నేహితులలో నున్న యుత్తరములే ప్రత్యేక

ప్రమాణములు' అని వెనుకకు తిరిగి, తివాల్వరుతీసి ఫామ్ను ప్రేల్చి నాడు. వినాయకరావు ప్రక్కకుపవంగి యుండుటచే దెబ్బ తగులలేదు. డ్రైవరు త్వరితగమనమున కారునుబోనిచ్చి 'ఇది చాలా విచిత్రముగ నున్నది. మీరెవరైనను నాకు లెక్కలేదు. మిమ్ములను పోలీసు స్టేషనునకు గొంపోవుదు' ననినాడు. వినాయకరావు జేబులోనుండి పదిరూపాయిలనోటు తీసి, డ్రైవరు కరమున కందించి, 304 బ్రూక్ పీల్డ యనినాడు, ఆనందోజ్వలవదనుడై డ్రైవరు మారుమాటాడక యాయింటికడ కారాపినాడు.

వినాయకరావు తాళముచెవిని బీగముల్లోనుంచిలోనికేగినాడు. తాను బయలుదేరుటకు ముందు దీపములు వెలిగియుండి, యిప్పు డారిపోయి యుండుటచే నతడు విస్మయముగొంది స్విచ్ నొక్కి లోనికేగినాడు. తనగది తలుపులు తెరువబడియున్నవి. టేబిలుపై నున్న కాగితములు క్రింద చిందరవందరగా బడియున్నవి. డ్రాయరు బలాత్కారముగ గ్రిందకు దీసివేయబడినవి. ఉత్తరముల ఫైల్సు తలక్రిందుగనున్నవి. ఫెంగ్‌హో వచ్చి 'కిటికీఅద్దములు పగులగొట్టబడి యున్నవి. ఆదారినే చోరులు వచ్చియుందురు. ఛాంగ్ శిరముపై బలమగు గాయమైనది. ఆతడు స్మృతివిహీనుడై పడియున్నాడు. ఇపుడే ముఖముపై జలము చల్లి వచ్చెద'నని యాతడు వెళ్ళగా వినా యకరావు టెలిఫోనులో నెవరినో పిలిచి 'అరగంటకు పూర్వము జరిగియుండును' అని మఱల డాక్టరు నవజీవన్ మొహాతాను బిలిచి, 'హల్లో డాక్టర్ ! ఇంటిలోనే యున్నావుకాదూ ?' అని చిందరవంద రమైయున్న కాగితముల సరిగా సర్దుకొనినాడు. ఫెంగ్‌హో యింత లో నటకురాగా ముఖ్యములైన కొన్ని పత్రయిలు పోయిన'వని నాడు తనతో మార్గము నెపుడు ప్రేమచంద్ జీవాజీ సంభాషించినాడో యపుడే వినాయకరా వట్టికార్యము జరిగియుండవచ్చునని యూహిం

చి, మిగిలిన ముఖ్యములైన పత్రములను మఱొక నిగూఢస్థలమున బదిల పఱచినాడు,

---

## ముప్పదిరెండవ ప్రకరణము

నాలుగు కొకెయిన్ ప్యాకెట్లు

శకుంతల కర్ధరాత్రమున మెలకువ కలిగినది ఆమె చిత్తమున నేదో చెప్పరాని యారాట ముదయించినది. ఆయావేదనకు గారణ మేమైయుండునాయని, శకుంతల ప్రక్కపై గూర్చుండి లేచి యాలో చింపసాగినది. మనోరమాదేవి — నవజీవన్ మెహతా — ఈశ్వర లాలు బ్యాంకరు—వీరెవరు నామె యారాటమునకు గారణభూతులు కారు. అప్పుడామె హృదయమున వినాయకరావు తోచినాడు. లీలను ఎంపైర్ వెరైటీ హాలులో చూచినది. వినాయకరావుతో సంభాషించినది. ఆమె హృదయకుహరమున బ్రతిధ్వనించినది. వినాయకరావు చర్యలు ఆమెకు జిత్రముగ దోచినది.

ఆత డనిన తన కేలకో కోపము—నభిమానము ఆమెకేమియు దోచలేదు. ఆమె గడియారమువంక చూచినది నాల్గుగంటలైనది. ఏవేవో యాలోచనతోనే నామె తెల్లవారువరకు నిద్రింపలేదు. ఐదు గంటలకు లేచి, కాల్యకరణీయముల నిర్వర్తించుకొని, స్నానముచేసి శకుంతల కాఫీత్రాగి ఎనిమిదిన్నరకే యేమియు దోచకపోవుటచే ఆఫీసునకు బయలుదేరినది. ఆమె ఆఫీసుచేరినంతనే ఇన్ స్పెక్టరు చంద్రమోహన్ ను, మఱియొక ఆఫీసరును, యిరువురు రక్షకభటులనుజూచినది. తనగదిలోనికిబోయి, ఆమెఇండెక్సు ననుసరించి, ఫైలుసరిచేయ సాగినది, గదివెలుపల చంద్రమోహన్; ఆఫీసరును 'ఇంకను ఆతడు

రా లేదు. అతను వచ్చిన పిదపనే సోదా చేయుమందురా?' అని యడిగినాడు.

'అవును అతను వచ్చిన పిదపనే సోదా ఆరంభించుము. అది యెచ్చటనున్నది?'

'ఈగది వినాయకరావుది. దీనివెనుకనున్న మరొక చిన్న గదిలో నుండియుండునని నాయనుమానము.'

ఈ పలుకులను శకుంతల యాలకించినది. వినాయకరావు కేదో యపకారము జరుగునని యూహించినది. ఆతని నెట్లయిన నాయాపద నుండి కాపాడుట మంచిదని యాలోచించుకొన్నది. వెంటనే వినాయకరావు గదివెనుకనున్న చిన్నగది చెంతకు బోయినది. చంద్రమోహన్ తాళముప్రైచి యుండుటచే కిటికీచెంతకు బోయి గాజు అద్దమును బగులగొట్టి లోని గడియను దీసి తానా గదిలో ప్రవేశించినది. ఒక పెట్టిమీద నాలుగు ప్యాకెట్లున్నవి. ఆప్యాకెట్లపైనున్న విలాసము సగము జర్మనీభాషలోను, సగము యింగ్లీషులోను నున్నది ప్యాకెట్ చించి చూచిన దామె తెల్లగా మిలమిల లాడుచున్న కొకెయిను అగపడినది. నాలుగు ప్యాకెట్లను యీవలకు గొనివచ్చి కిటికీ తలుపులు మరల బంధించి బద్దలైపోయిన కిటికీ అద్దమును నాలుగు ముక్కలుగా విరుకగొట్టి యా యద్దపు బెంకులను నాల్గు ప్యాకెట్లలోని కొకెయినును తూము కాలువలో బారపోసి నీరుపోసినది కొకెయిను కొట్టికొనిపోయినది. ఆమె వినాయకరావు గదిలోనికేగి తలుపు లోన బంధించుకొని ఆప్యాకెట్లు కవర్లు నగ్గిపుల్లతో నంటించినది. ఇన్‌స్పెక్టరు చంద్రమోహన్ రెండు మూడు సార్లు తలుపు తట్టినను ఆమె వినక తన పని ముగిసినవెంటనే యీవలకు వచ్చినది.

ఆతడా చిన్నగది కిటికీ అద్దము పగులగొట్టబడి యుండుట చూచి 'ఏమమ్మా! నీవు చేసినదేమి? కారాగృహవాసము కుతూహల

ముగ నున్నవా? ఈ యద్దము నెవరు పగులగొట్టినా?' రని యడిగి నాడు. ఇన్‌స్పెక్టర్‌గ్లి గంభీరముగ నడిగినను ఆమె జంకుకొంకులు లేక 'ఏమి చేసినాను? ఎవరు పగులగొట్టినారు? ఎవరికి గావలయును?' అని తొణకకుండ వణకకుండ పల్కినది. చంద్రమోహాన్ నిర్ఘాంతు పైనాడు. 'అమ్మాయీ! శకుంతలా! ఇన్‌స్పెక్టరునకు జక్కని పాఠము నేర్పినా' వనినాడు తానంతకు మున్ను చూచియున్న ఆఫీసరు చంద్ర మోహన్ వినాయకరావు గది సోదా చేయసాగినాడు. ఇంతలో వినాయకరావు వచ్చి ఇన్‌స్పెక్టరును జూచి 'వారంటేదీ?' అనినాడు.

చంద్రమోహాను వారంటుకాగితము చూపగా వినాయకరావు 'ఇది నాయిల్లు సోదాచేయుటకు జారీచేయబడినది. ఆఫీసు సోదా చేయుటకు నీకధికారములేదే?' అనినాడు. 'ఉన్నది' అని చంద్ర మోహన్ మఱొక ఆఫీసరుకడనున్న యావారంటును దెచ్చి చూపి నాడు. కొంతసేపు వెదకి చంద్రమోహన్ 'అవును ముందుగానే శకుంతల జాగ్రతపడినప్పుడవియెట్లు మనకు దొరకును?' అని వినా యకరావుకు బ్రద్దలైపోయిన కిటికీచూపి 'శకుంతలా! ఇందులకు దగు రీతిని పశ్చాత్తాపము నొందకపోవులే' అనినాడు.

'ఆమె పశ్చాత్తాపపడినపుడు నీకు దప్పక టెలిఫోనులో దెలియ జేయుదునులే' యని వినాయకరావు పలుక చంద్రమోహన్ తల పంకించి రక్షకభటసమేతముగ వెడలిపోయినాడు. వారు వెడలి పోయినపిదప వినాయకరావు శకుంతలను దనగదిలోనికి బిలిచి శకుం తలా! అద్దము తొలగించినది నీవేనా?' అని యడిగినాడు—

'అవును ఆగదిలో నేగోయున్నదని వారు చెప్పుకొనుచుండగా విని చూచితిని. నాలుగుప్యాకెట్లు కొకెయినుఉన్నది. కొకెయినుతూము కాలువలో బారపోసి కవర్లు దగ్ధమొనరించినాను.'

'చాలగొప్పయుపకారము చేసినావు శకుంతలా! నీమేలుమఱచి పోను అగడిలో కొంకేయినున్నదని చంద్రమోహనున కెట్లు తెలిసినో చెప్పినాడా?'

'లేదు—'

'నాకుజాల నాశ్చర్యకరముగనున్నది. అతడే ముందుగావచ్చి యాప్యేక్షలనట బడక్కై చియుండును'

'ఎవరు?'

'శకుంతలా! ప్రేమచందుజీవాః అను నాతని పని యిది''

''అట్లయిన మీరు మత్తుమందుల వ్యాపారముచేయుట లేదా?'

'శకుంతలా! అనవసరమైన యనుమానములకు నీహృదయమునదావీయకుము నాకు మత్తుమందుల వ్యాపారముతో సంబంధము లేదు. 'కేసియానా' యనుపేరుతో సుఖవిరేచనము కునట్టి బిళ్ళలు తప్పనాకు దెలిసియున్నంతవఱకు బాంబే ప్రేడింగు కార్పొరేషను ఏమియు విక్రయించుట లేదు'

శకుంతల హృదయాంబరమున పెక్కు ఆలోచనలు తటిల్లతలవోలె మెఱసినవి.

---

## ము ప్ప ది మూ డ వ ప్ర క ర ణ ము

---

### హంతకు డతడేనా?

'అట్లయిన మీరు సోమోకానని నాతో నొకసారి చెప్పినారే?'

'అవును. అయినను మత్తుమందుల వ్యాపారముతో నాకేమియుసంబంధము లేదు. ఫెంగ్ హూ నొకసారి రమ్మని చెప్పుము'

శకుంతల వెళ్ళి ఫెంగ్ హోను బిలిచి, తనగదిలోనికి బోయినది గంటసేపైన పిదప వినాయకరావామె గదిలోనికివచ్చి 'చీనావర్తకునకు వ్రాసిన యుత్తరమేది'' యని ఏవో మార్పుచేసి, మరల వలదని మఱొకసారి టైపుచేయించితిని 'శ్రమ యిచ్చితిని మన్నింపు'మనినాడు.

శకుంతల నవ్వి 'శ్రమలేదు. మీపద్ధతులన్నియు నిపుడిపుడు బోధపడుతున్నవి.' అనినది.

'మఱి శనివారమునాడే మానివేయుదునన్నావే, యని వినాయకరావు నవ్వి వెళ్ళిపోయినాడు అతడు తిరిగివచ్చి 'శకుంతలా! నేటిరాత్రి యెచటనైన విందున్నదా? ఎచ్చటికైన బోయెదవా? యనినాడు.

'పనిలేదు 'ఓపెరాహౌసు' నుండి భక్తతులసీదాసు నాటకము రేడియోలో బ్రాడ్ కాస్టుచేయుచున్నారు అది వినుటయే నాపని'

'సరే. ఆ అరలబీరువానుగూర్చి ఏమరవలదు సుమా' అని యాతడు వెడలిపోయినాడు. మూడుసార్లు టైపుచేయించిన యుత్తరములో ఎఫ్. ఓ. ఐ. అనియున్నది. అందులో ప్రేమచందు అనువాని నిరోధములను సాధ్యమయినంత శీఘ్రముగ దొలగించుకొందునని యున్నది. ఉత్తరములన్నియు టైపుచేసి, ఆతనిచే సంతకములజేయించి ఒంటిగంటకు విరామకాలములో నేదియో జ్ఞాపకమురాగా నామె బస్సునెక్కి తిన్నగా కోలాబాలో దాను బనిచేసియున్న మనోరమాదేవి సౌధమునకు బోయినది. తానెటకో పోవుదునని మనోరమాదేవి తాళపు చెవి నామె కిచ్చినది ఆమె సౌధముపైకిబోయి చూచినది. తనగది తలుపు తెఱువబడియున్నవి. ఆగదిలో మధ్య తన అయిదు అరలబీరువా పడియున్నది. నవజీవన్ మెహతా నాలుగవఅరను 'టరన్ స్క్రూ' సాహాయ్యమున దీయుచుండుటగాంచి, ఆమె నిశ్చేష్టురాలైనది. ఆమెనుజూచి, నవజీవన్ మెహతా బిచ్చవడి 'నీకు తెలియకుండ

యీామత్తుమందులను తొలగించుట యుక్తమని తలచినాను. మన్నిం పుము. వినాయకరావేమి చేయుచున్నాడు. ఉదయమున ఈశ్వర లాలు యింటికి వెళ్ళినాను. నీవుకాఫీ త్రాగినావా ?' అనియడిగినాడు.

'త్రాగినాను. సరే ఆ యరను దెలుపు' మనినదామె.

'వలదు. నీవు లేనపుడేతీయవలయును. నేను లేనపుడుమా త్రము నీవుతెలుసవల'దని ఖండితముగాజెప్పి యీావలకు వచ్చినాడు.

'నాకాతాళపు జెవి నిమ్మ.'

'నాసాధము తాళపుజెవి నాదగ్గర లేకుండ చేయుదువా ?'

'నీసాధమా ? తెలియు' దని ఆతాళపుజెవి తీసికొని తనట్రంకు లోని క్రొత్తతాళముచే గదిని బంధించి, వెడలిపోయినది. విచార భరితాత్ముడై తన దురదృష్టమును నిందించుకొనుచు నవవస్ మెహతా వెడలినాడు. ఆమె ఆఫీసుకు బస్సుమీాద వెళ్ళినది. నౌకరు కుఱ్ఱవానిచే కాఫీ తెప్పించుకొని త్రాగినది. ఇంతలో టెలిఫోను గణగణ మ్రోగినది. ఆమె వెళ్ళి 'ఎవరువా' రని యడిగినది.

'నేను ఈశ్వరలాలును. ఆమాట్లాడునది శకుంతలయేనా ?'

'అవును. శకుంతలా! అత్యవసరమైన కార్యము. అరగంటలో దిరిగి వెళ్ళిపోవచ్చును. సాధ్యమైనచో నీయజమానికినా కడకువచ్చు చున్నానని చెప్పకుండుట మంచిది. ఇప్పుడే రావలయును. నీకొఱకు వీధిలో నిలిచియుందును.'

శకుంతల వినాయకరావు గదిలోనికి వెళ్ళి అరగంట సెలవిమ్మని ఈశ్వరలాలు ఏదో జరూరుగా సంభాషించుటకు రమ్మనినాడని చెప్పి యాతని సెలవుగొని వెడలిపోయినది.

దాదరులోని ఈశ్వరలాలు సౌధమును శకుంతల సమీాపించి నది. వీధిలోనిలువబడి ఆమెరాకనాతడు నిరీక్షింపసాగినాడు. 'రమ్మ.

నీకొఱకే చూచుచున్నా' నని యతడామెతో దన కారులో నెక్కినాడు. డ్రైవరు త్వరితగమనమున బోనీయసాగినాడు.

'నేనరగంటలో ఆఫీసునకు దిరిగి వెళ్ళిపోవలయును'

'అవును. అట్లే వెళ్ళిపోవచ్చును. శకుంతలా! లీల మీ ఆఫీసులో పనిచేయుచున్నదా? ఆమె భాగ్యశాలినియా?'

'ఆమె తండ్రి ధనాఢ్యుడని విందును.'

ఇంతలో కారు మూడు గేట్ ఆవరణదగ్గఱ యొక్కసరిగా కుదుపబడి ఆయావరణములోనికి పోబోవ 'డ్రైవర్! తిన్నగా బోనిమ్ము' అని కఠినముగ బలికినాడు. డ్రైవరు తిన్నగా బోనిచ్చినాడు. వారు లేమింగ్టను రోడ్డున బోసాగినారు. ఆ ఆవరణములోనికి కారు నెందులకు నడుప ప్రయత్నించినాడాయను సందేహమాతని చిత్తమున నుత్పన్నమొనరించినది.

'వారము రోజులైన దీక్రొత్త డ్రైవరు నౌకరీకుదిరి. ఏమో... నాకంతయు సంశయాస్పదముగానున్నది......కాని గొప్ప వర్తకులు, ఉద్యోగులుయిచ్చిన యోగ్యతాపత్రములు చూపినాడు. ఆ ఆవరణలోనికి కారు వెళ్ళియున్నచో నేను యీపాటికి హత్యగావింపబడి యుందును...లీలసంగతి ఆశ్చర్యముగానున్నది. ఆమె సహజముగా భాగ్యశాలియా? లేక నన్ను మోసము చేయుచున్నదా?'

'ఆమెకు మీ బ్యాంకులో ఖాతాయున్నదా?'

'సరే' యనియతడామె నాఫీసుకడదిగబెట్టి వెడలిపోయినాడు.

ఆమె గదిలోనికి వెళ్ళినంతనే గడియారమ్రోగినది. శకుంతల వినాయకరావు గదిలోనికి వెళ్ళినది. అతడామెవంక చూడకయే 'కారులో నెంతదూరము వెళ్ళినావు' అని యడిగినాడు.

'నేను కారులో వెళ్ళినానని మీ కెట్లు తెలియును?'

'పెంగ్ హో చూచినాడు. డ్రైవరు ముఖము చూచినావా?'

'చూచినాను. చాలతీక్షణములైన దృక్కులాతనివి. గడ్డము న్నది. సులోచనములు ధరించినాడు.'

'మార్గరీట్ ఆవరణదగ్గఱ ప్రమాదమేమియు జరుగలేదు గదా! కారా ఆవరణలోనికి బోయియున్నచో నీవొక్కర్తవే యీ పాటికి దిరిగి వచ్చుచుందువు. అతడు నిజముగా జిత్రవధ గావింపబడి యుండును. ఆ డ్రైవరు ధరించిన గడ్డమది నిజమయినదికాదు.

'అతడెవరు? అతనినిగూర్చి ఈశ్వరలాలుకు దెలియదా?'

'తెలియదు. నేటిసాయంకాలములోగా దెలియజేయబడును ఆడ్రైవరు ప్రేమచందు వాజీ! గొప్పజిత్తులమారి సరే అంతయు నీ కెందులకు అతడే నాహంతకుడు?'

'శకుంతలా! కళవళపడకుము. నేనుచెప్పినట్లు చేయుము. లీల యిల్లుచూచినావా?'

'లేదు—'

'అట్లయిన నేటిసాయంకాలమే చూచిరమ్ము.'

---

## ముప్పదినాలుగవ ప్రకరణము.

'చెక్కులమీద సంతకములు'

సాయంకాలము ఆఫీసునుండి వెడలిపోవునపుడు శకుంతల 'లీలా! వాకేమియు దోచుటలేదు. నీతో మీయింటికి వచ్చెదను' అన్నది. 'మాయింటికా—నేడా—సరే. రమ్ము' అని తీసుకొని వెళ్ళినది. ఆమె నిల్లీపరేలులో నివసించుచున్నది. శకుంతల విశాలమైన ఆవరణ

లోనున్న ఆయింటిలో చాల ఖరీదుగల సోఫాలు, కుర్చీలు, బల్లలు చూచినది. గారేజికీవల నొక డాబాయున్నది. ఆడాబామీదనున్న చిన్నగదిలోనుండి యొక డీవలకు వచ్చినాడు. అతనిని శకుంతలచూచినది. గడ్డముతోనున్న యతనిని తాను అంతకుమున్న చూచినది. అతడే ఈశ్వరలాలు మోటారుడ్రైవరు రత్నలాలు హారీతకుండు శకుంతల హృదయము భయముతో నిండిపోయినది. ఆమె లీలతండ్రియగు రామనారాయణలాలుతో గొంతసేపు సంభాషించినది. పిదప నామె వెడలిపోయినది. ఆమె వెళ్ళుటకు ముందు 'లీలా! నేను నిన్ను ఎంపైర్ వెరైటీహాలులో పాడుచుండగా జూచినాను. నేనుకాదు వినాయకరావుకూడ' అనినది. లీల తెల్లపోయినది. శకుంతల వెళ్ళిపోయిన తరువాత రామనారాయణలాలు లీలను పిలిచి 'నేడు కూడ రాత్రి తొమ్మిది గంటలకు నేంపైరు వెరైటీహాలుకుబోయి, బ్రాడ్‌కాస్టింగు డ్యాన్సులు అన్నియు ముగిసినవెనుక యింటికిరమ్ము. ఒంటిగంటలోగా రావలదు. ఈచెక్కులుమీద సంతకములుచేయు' మనినాడు, 'ప్రేమచందు జీవాజీ' యని ఆమె సంతకముచేసి 'ఆఉత్తరములు మాత్రమే దొరకినవి. మరేమియు దొరకలేదు' అనినది.

---

## ముప్పదవ ప్రకరణము

### మహా విపత్తు

శకుంతల ఆఫీసువదలి వెళ్ళిపోయినపిదప వినాయకరావు ఏవో ప్రైవేటుపుత్తరములు వ్రాసికొనుచుండగా నొకరువచ్చి 'ఈశ్వరలాలు బ్యాంకరుగారు వచ్చినా' రనినాడు.

'లోనికిరమ్మను'

ఈశ్వరలాలు లోనప్రవేశించినాడు అతనిని కూర్చుండనియమించి 'ఏమివిశేషము?' లనినాడు.

'వినాయకరావు! ముందే తమకు మార్పణ వేడుచున్నాను. ఆనాడు నీవుచెప్పిన జ్యోతిషము చాలవఱకు యథార్థముగ పరిణమించినది. నేను మహావిపత్తులోనున్నాను. రెండు సంవత్సరములనుండి నావ్యాపారములో నేట్టి లోపమును లేదు.'

'లేకేమి? రెండేండ్లనుండి నీవు తప్పుడు లెక్కలవేయుచు బ్యాంకు దివాలాతీయకుండ నిలబెట్టినావు.''

'అవును. ప్రేమచందు జీవాజీమూలమున నాబ్యాంకు నిజముగా నిపుడు నామరూపములులేకుండ నైపోవుటకు సిద్ధముగనున్నది నాయందుదయయుంచిపైన సలహానిమ్ము వారమురోజులకు పూర్వము నాకొకక్రొత్తమోటారు డ్రైవరు ప్రాప్తించినాడు మంచి యోగ్యతాపత్రములతో వచ్చిన యాడ్రైవరు చర్యలు అనుమానాస్పదముగనున్నవి. నిన్నరాత్రి యతడు నాశయ్యాగారములో గోడకమర్పబడియున్న యినుపమందసముదగ్గఱ నిలిచియుండగా నౌకరు చూచి నాతో చెప్పినాడు ఆమందసములోనిది బంగారపుసిగరెట్ కేసు పోయినది ఆకేసులో చిన్ననోటుపుస్తకమున్నది. దానిలో నొకటిరెండు రహస్యములున్నవి. నన్ను కరుణించి, పతనమొందవకుండ యుద్ధరింపుము.' అని వెళ్ళిపోయినాడు ఆతడు వెడలిపోయినపిదప వినాయకరావు సిగరెట్ వెలిగించినాడు ఆతని ముఖమునవాందోళనము ప్రస్ఫుటమగుచున్నది. ఆయాందోళనము శకుంతలవిషయమై యని యెవరు గ్రహింపగలరు?

ఆతడు ఫెంగ్‌హోను బిలిచి 'రివాల్వరును, రేడియో రిశీవరును యిట్లిమ్ము'అనినాడు.

'జగన్మోహనదాసు, కంజీభాయి అనువారలకు గూడ నవజీవన్ మెహాతా రత్నలాలుర యిండియన్ ట్రేడింగు కంపెనీలో భాగ

మున్నదని అరెస్టుచేయబడిన విషయము విన్నంతనే డాక్టరు గుండెలు ఝల్లుమనును. ఆతడే హంతకుడు నేనాబాకుతో 'హిస్సు' మని పొడి చినధ్వనికూడ వినియున్నాను.'

'ఫెంగ్ హో! హంతకుడు డాక్టరుకాదు. ప్రేమచందుజీవాజీ నీవుకారును 'ఎంపైర్ వెరైటీహాలు ప్రక్కనున్న సందులో నుంచు మని, సిటీపోలీసుస్టేషనులోనున్న సూపరెండెంటు విల్లీని టెలిఫోనులో బిలిచి 'రాత్రి 11 గంటలకు ఇన్‌స్పెక్టరు చంద్రమోహన్‌ను మా యింటికి బంపగోరెదను. చాల జరుగురుగా మాట్లాడవలసి యున్నది.' అని బయలుదేరినాడు.

*　　*　　*　　*

కంజీభాయి జగన్మోహనదాసు లెరస్టు చేయబడినారని విని డాక్టరు నవజీవన్ మెహతా క్రుంగిపోయినాడు ఆతడు మనోరమాదేవిని బిలిచి 'మనూ! నీవు నాకు మహోపకారము చేయవలయును నేనిపుడు మహావిపత్తులోనున్నాను. నేనిపుడింటికిబోయి కొంత జరుగురు క్షనిమం గించుకొని 10 గంటలకు పోచేనుయుదును. అపుడు నీవు ఎంపైర్ వెరై టీహాలునకు బోవలయును. శకుంతలకేమైన హానిచేయుదునని నీవు భీతిల నక్కఱలేదు. ఆమె గదిలోనున్న యొక పెట్టెలో నాకుగావలసి నవి కొన్నికాగితములు మాత్రమే' అని వెడలిపోయినాడు.

పదిగంటలైనది. శకుంతల 'ఎంపైర్ వెరైటీహాలునుండి బ్రాడ్‌కాస్టు చేయబడుచున్న సంగీతమును వినసాగినది. ఇంతలో టెలిఫోనులో మనోరమాదేవినిడాక్టర్ నవజీవన్ మెహతాపిలిచినీసౌ ధమున కెదుట నెవ్వరైన పొంచియున్నారా? చూడు' మనినాడు.

'భక్తతులసీదాసు' నాటక మారంభమైనది—స్ఫుటముగా గానము వినిపించసాగినది. ఇంతలో 'షో అవతలకు ఫోస్టేజిమీదనుండి

పో.' అని కేకలు గోల వినిపించినవి. ఆ గోలలోనే 'శకుంతలా!' అని వినబడినది. అది వినాయకరావు కంఠధ్వని.

'శకుంతలా! నీగదిద్వారము బంధించుము. ఏమైన అప్రమత్తగా నుంచుము. నీవు మహావిపత్తులో నున్నావు. ఎవరిని రానీయకుము. వెంటనే బంధించు' మనినాడు.

---

## ముప్పదియాఱవ ప్రకరణము

---

### అరెస్టు

ఎంపైర్ వెరైటీ అందు డ్యాన్సుహాలులో బాల్కనిపై నున్న యొక బాక్సులో, గూర్చుండి వినాయకరావు తనయొద్దనున్న రేడియో వైరు గోడకుదగిలించి వినసాగినాడు. 'భక్తతులసీదాసు' నాటకము బ్రాడ్ కాస్టు చేయసాగినారు. ఆతడు కూర్చుండియున్న బాక్సు వెనుక నున్న బాక్సులో గూర్చుండియున్న యిద్దరికంఠస్వరము లాతనికి వినిపించినవి.

''ఆమెనుచంపియైననుసరే. ఆపెట్టె సంపాదించవలెను.'

'ఆపెట్టెలోనే ధనముండియుండునా ?'

'అవును. సరిగా 11 గంటలకు వెళ్ళిపోదము, ఆమెను జంపుటకు వెనుదీయవలదు'

ఆవాక్యములన్నియు వినాయకరావు వినినాడు. తన బాక్సులో నుండి యతడు మఱొక బాక్సులోనికి వెళ్ళి టైముచూచినాడు. పదకొండు గంటలకు నైదునిమిషములున్నది. అతడు 'ఇక అయిదునిమిషములున్న' దని బాల్కనీనుండి వెనుకబాక్సులో వారు చూడకుండ క్రిందకుఱికినాడు. ప్రొఫెసరు జ్యోతిర్మయిసింగుతులసీదాసుపాత్ర నభిన

యించి జగన్మోహనకరముగ పాడసాగినాడు. అతడు తిన్నగా స్టేజి మీదకు త్రాగియున్నవానివలె దూలుచు వెళ్ళినాడు. ఆతనిహృదయములో శకుంతలరక్షణముతక్క — తన వెనుకనున్న బాక్సులో కూర్చుండి యున్నవారిమాటలుతక్క తదన్యధ్యానమేమియు లేదు.

'షో. షో.' అని కేకలు ప్రేక్షకజనసమూహామునుండి వచ్చుచున్నను లక్ష్యముసేయక 'శకుంతలా! అని పిలిచి తలుపుబంధించుకొను మని కేకవైచినాడు. స్టేజిమేనేజరువచ్చి వినాయకరావును లోనికిలాగివైచినాడు. ఆతనితో చెవిలోనేదియోచెప్పి టెలిఫోనులో నెవరితోనో మాట్లాడి మఱొకదారిని వీధిలోనికిబోయి ప్రక్కసందులోనున్న కారు నెక్కినాడు. దారిలో నతఁడు ఫెంగ్‌హోను కలిసికొనినాడు. కారు మెల్లగా కోలాబావైపు పోసాగినది.

* * *

వినాయకరావు హెచ్చరిక వినిపించినంతనే శకుంతల భయకంపితయై యూపెట్టెను, మంచమును దలుపునకడ్డముగా త్రోసివైచి, మంచముపై గూర్చుండినది. ఇంతలో నామెకు 'అయ్యో!' అను నాక్రందనధ్వని వినిపించినది. ఆకంఠస్వరము మనోరమాదేవిది మఱొక నిమిషము గడచినది.

'తలుపు తెఱువుము'

'ఎవరువారు?' అని శకుంతల గర్జించినది.

'నేను, నవజీవన్ మెహతాను. నీకేమియు నపకారము చేయను ఆ అరలబీరువా నాకిచ్చివేయుము.'

''తలుపు తీయను' అని ఆమె కిటికీచెంతకుఁ బరుగెత్తినది. ఆమె కంపింపసాగినది. ఇంతలో నొకకారువచ్చి ఆగినది. మఱొక నిమిషములో 'శకుంతలా!' అను కంఠధ్వని వినాయకరావుది వినిపించినది.

''నవజీవన్ మెహతా వెళ్ళిపోయినాడా?'

'అహా! తలుపు తెఱువుము'

శకుంతల తలుపుదెఱచినది. వారు మనోరమాదేవి గదిలోనికి వెళ్ళినారు. ఆమె క్రిందబడియున్నది. ఆమెదుస్తులు చినిగియున్నవి. కంఠమున కొక సిల్కు జేబురూమాలు గట్టిగా ఊపిరి తిరుగకుండ బిగింపబడియున్నది. శకుంతల జలము నామె ముఖముపై జల్లుచుండగా, వినాయకరావు చిందరవందరగ నున్న యామె టేబిలు అరల శోధించినాడు. అంతలో నామె కనులు తెఱచి 'ఆపుస్తకము-బంగారపు కేసులోనిదే గొనిపోయినాడు' అన్నది.

'ఎవరిది? ఈశ్వరలాలుదా?'

'అవును. నాకత డిచ్చినాడు——'

ఆమెను వారు మంచముపై బరుండజేసినారు. శకుంతల నటనే యుండ నియమించి, వినాయకరా వామె గదిలోనికిబోయి, అయిదు నిమిషములలో నొకనూట్ కేసుతో నీవలకు వచ్చినాడు. ఆనూట్ కేసులో నేమున్నదో శకుంతల గ్రహించినది వినాయకరా విట్లనినాడు

'రమ్ము, శకుంతలా రమ్ము. ముందుగా నిన్ను సురక్షితస్థానము జేర్చవలయు' ననినాడు ఫెంగ్ హో, డ్రైవరు, వినాయకరావు, శకుంతల ఈవలకువచ్చుసరికి నవజీవన్ మెహతా 'శకుంతలా! ఎక్కడకు?' కనినాడు.

'ఏమి ఎందులకు?' అని వినాయకరావు హేళనపూర్వకముగా బలికినాడు.

'ఆనూట్ కేసులో నేమున్నది?'

'ఏదో-కొంచెము-సుమా రాఱులక్షలరూపాయలధనమున్నది ఇంతకుమించి నన్నడుగవలదు. అడిగినను చెప్పను'

నవజీవన్ మెహతా వెడలిపోయినాడు. ఫెంగ్ హో యటనే యుండి, నవజీవన్ మెహతా పోకడలను గుర్తించుమని వినాయకరావు చెప్పిన పిదప నొకకారువచ్చి యాగినది. యూనిఫారములో నున్న యొక ఆఫీసరు కారునుండి క్రిందకు దిగి మిష్టర్ వినాయకరావు! నీ కరెస్టు వారంటున్నది' అనినాడు—

ఆవారంటునుచూచి వినాయకరావు దీర్ఘవిశ్వాసమువిడిచి 'సరే ఈఅమ్మాయిని మోడరన్ హోటలులో విడువవలయు'నని కారునెక్కినాడు శకుంతలకూడ కారులోనెక్కినది. వినాయకరావు చేతులకు సంకెళ్ళు తగిలింపబడినవి. ఆతని మొలనున్న రివాల్వరు నూడలాగికొని 'జాగ్రత వినాయకరావు! పాఱిపో బ్రయత్నింపకు'మని నాడు. అతడు ఆలోచించినాడు. ఆ ఆఫీసరు రామనారాయణలాలై యుండునాయని యోచించినాడు. శకుంతలకు గూడ అదేసమయమున నాయనుమానము తోచినది.

'మన మెచ్చటికి బోవుచున్నాము? ఈమెను హోటలులో విడువవలయు' ననినాడు వినాయకరావు.

'వలనుపడదు. అదిగాక ఆమె మాకుం గావలయును—'

'అప్పను రామనారాయణలాల్! నీవు తుదకు నన్ను మోసగించినావు'

కారు విల్లీపరేలులో నొకచోట నాగినది. అంధకారబంధురమైన యావరణలోనికి వారిద్దరును గొంపోబడినారు.



వినాయకరావు కారులో గొంపోబడినంతనే ఫెంగ్ హో కారు డ్రైవరువలన జరిగినప్రమాదము గుర్తించినాడు. డాక్టరు నవజీవన్ మెహతా యచ్చటకురాగా ఫెంగ్ హో జరిగినదంతయు చెప్పినాడు.

ముగ్గురును కారునెక్కి యొకదాని ననుసరించి వెళ్ళి, విఫలమనోరథు లైనారు. కారులోనవజీవన్ మొహతానుమజ్లూకరోడ్డు ననుసరించి, కొంత దూరము పోయిరమ్మని, ఫెంగ్ హో నడచుచుపోయినాడు ఒకకారులో నలుపు టాప్ లైట్ కాంతిలో వినాయకరావును గుర్తించి, పరుగుపరుగున ననుసరించి వెళ్ళినాడు. ఇంతలో నొకచోట వెనుకనుండి నలుగురు వచ్చి యాతనిపై గలియబడినారు. ఫెంగ్ హో తనమొలనున్న బాకుతో నొకరిని పొడిచినాడు. మఱొకడు శిరముపై బలమగు దెబ్బకొట్టినాడు. ఇంకొకడు బాకుతో బొడువ ఫెంగ్ హో స్మృతిహీనుడై క్రిందబడిపోయినాడు.

'కోటలోనికి—త్వరితముగా' నని యొండు పలుక నిర్వురు ఫెంగ్ హోను లోనికి గొంపోయినారు.

*　　*　　*

'జాగ్రతగా లోనికిరమ్ము' అని రామనారాయణలాలు వినాయకరావు నుద్దేశించి పలికినాడు. డ్రైవరు వచ్చి, గొలుసులతో బంధింపబడియున్న గారేజీని తెఱచి, వినాయకరావును, శకుంతలను లోనికి ద్రోసినాడు. ఒకచిన్నలాంపు వెలిగింపబడినది. రామనారాయణలాలు ఆవలకుబోగా వినాయకరావు 'శకుంతలా! ఇది రామ నారాయణలాలు గారేజీ' అనినాడు. ఆత డిరువురితోవచ్చి 'ఆమె నీవలకు గొనిరమ్ము' అని యొకని నుద్దేశించి పలికినాడు.

శకుంతల భయకంపితయై వినాయకరావు నంటిపెట్టుకొనిపోయి 'నన్ను విడవకు' మని బ్రతిమాలినది.

'నీకు నాకంఠమున బ్రాణముండగా భయములే' దని యామె నాలింగన మొనరించుకొని ముద్దిడుకొనినాడు. తన యెదుట నున్న మహావిపత్తునైత మామె మఱచి, యపారసౌఖ్య మనుభవించినది.

ఒకడు బలవంతముగ నామెను లాగినాడు. ఆమె వెనువెంటనే మూర్ఛాగతయై యాతని చేతిలో వ్రాలినది. ఇరువురును, ఆమెను సౌధములోనికి గొంపోయినారు.

మూర్ఛపోవుటయే శ్రేయస్కరమని వినాయకరావొక వేడి నిట్టూర్పును విడిచినాడు.

---

## ముప్పదియేడవ ప్రకరణము

### మృత్యుమందిరము

'వినాయకరావు! నీవు కొలది నిమిషములుమాత్రమే జీవింతువు తెలిసినదా? యని రామనారాయణలాలు ఆగదిలో నొక మూలనున్న సంచిలోని సిమెంటును క్రిందదిమ్మరించి, నీటితో గలిపినాడు. ఆగారేజీకి మధ్య నొకగోయి యున్నది. ఒక పళ్ళెముతో నతడా గోయి నొకసారి కలచినాడు. ఇంతలో ప్రేమచందు జీరాజీ వచ్చి 'మిత్రమా! ఫెంగ్‌హో పాపము నీకొఱకు బరుగెత్తుకొని, కొంతదూరమువచ్చినాడు. అతనికేకాదు, నాకును బాకునుపయోగించు విధము తెలియును' అనినాడు.

సరే. నాకు తెలియును. ఫెంగ్‌హో బొడిచి యుందువు'

'ఈగోయి నీకే నిర్దేశింప బడినది'

'శకుంతల నేమిచేయుదురు ?'

'అది నాకు దెలియదు. అతని కామెతో జాలపని యున్నది. ఆమెవలన దెలిసికొనవలసిన విషయములు చాల యున్నవట.'

'ఆమె కేమియు దెలియదు. తుదకు నేనెవరో కూడ ఆమె యెరుగదు'

'మత్తుమందుల వ్యాపారముచేయుచున్న గ్యాంగులను బట్టు కొనుటలో కృతార్థుడు కాలేకపోయిన చంద్రమోహన్ కు బదులుగా నియమింపబడిన పరిశోధకుడవని నాకు దెలియకపోలేదు.

సంకెళ్ళనుండి విడివడు నుపాయము వినాయకరావు లోకవస్తువు గారడీవానినుండి నేర్చికొనియున్నాడు. అతడిప్పు డాయింద్రజాలమును జ్ఞప్తికి దెచ్చుకొన బ్రయత్నించినాడు. రామనారాయణలాలు వచ్చి 'ప్రేమచంద్! నేనేగియాశకుంతలను జూచుచుందును' అని వెడలిపోగా ప్రేమచందు! 'వినాయకరావు! నిన్ను వధించుటకు నియమింపబడిన యతడిడుగో' అని యొక తలుపు దెఱచినాడు వినాయకరావు వలు చూచినాడు, ఈశ్వరలాలుబ్యాంకరు—చేతిలో చిన్నకత్తితో ప్రవేశించినాడు.

'వినాయకరావు! ఈదండమెచ్చటిదోగు ర్తింపగలవా? ఆనాడు నీవు నన్నీ కత్తితోనే కొట్టినావు. ఇదిగో రక్తపుమఱక తెలిసినదా! నాస్నేహితులు నీగదిలోనుండి గొనివచ్చినారు. నారక్తమెంత విలువ గలిగినదో తెలియునా? నిన్ను నేను చంపెదను తెలిసినదా!' అని వినాయకరావు చేతులకున్న సంకెళ్ళు తనిఖీచేసి, తనకోటు విప్పిటోపీ నాకోటుపైనుంచి 'ప్రేమచంద్ నీవు వెడలిపోము. పదినిమిషములలో దిరిగి రమ్ము అప్పటికి నాపని ముగించి, నేను వెడలిపోయియుందును. నీవును రామనారాయణలాలును వచ్చి, మీకు మిగిలియున్న కార్య శేషమును బూర్తిచేయు'డని తలుపు బంధించినాడు.

ఆయుత్తరక్షణమున 'టరీ' మనియొక దెబ్బ వినిపించినది. ప్రేమచందు మేడలోనికి బోయి చూచినాడు వంటగదిలో రామనారాయణలాలు కూర్చుండి, విస్కీగ్లాసునిండుగ బోసికొని త్రాగినాడు

'రామనారాయణ! శకుంతలకు మత్తుమందిమ్ము ఆమె నీకుమాత్రైను గలిసికోరాదు——పది నిమిషములైన తరువాత నీవు గారేజీలోనికి బోయి, యీపని ముగించవలయును, ఇపుడు సరిగా 12 గంటలైనది' అని ప్రేమచందు పలుక, రామనారాయణలాలు 'పోలీసులు వెదకుదు రేమో నీవు సాహాయ్యముచేయవా?' యనినాడు.

'ఊహూ! పదినిమిషములు కూడ నవసరములే దాపనికి ఆవైనా వానికై నీవు పరితపింప నక్కఱలేదు వాత శిరముపై గొట్టినాను. అని రక్తసిక్తమైన యొక చిన్న లాఠీని చూపినాడు పదినిమిషము లైనది. భయముచే వణచున్న రామనారాయణలాలును 'లెమ్ము. రమ్ము' అని ప్రేమచందు గారేజీ కడకు గొంపోయినాడు క్రొవ్వొత్తి దీపము మినుకు మినుకుమని ఆఱిపోయినది. ఆగ్రుడ్డి వెలుతురులో రామనారాయణలాలు క్రిందబడియున్న సంకెళ్ళను, గోతిలో కూల బడియున్న మనుజునిచూచి, యీప్రక్కనే తడిసియున్న సిమెంటును గోతినిండుగ బూడ్చి, తనుముగొనుచు నీవలకు వచ్చినాడు' వినాయక రావు దయ్యమై తన్ను వెంబడించుచున్నాడనియే యాతని యను మానము.

రామనారాయణలా లీవలకువచ్చినాడు. అతని సౌధములోనికి గొంపోయి, గ్లాసులో విస్కీపోసి, త్రాగనిచ్చి ప్రేమచందు 'ఇదిగో తాళము. చెవి. నేను ఈశ్వరలాలు బ్యాంకరుతో నీవిషయము చెప్పి, శకుంతలనేమిచేయవలయునో కనుగొనివచ్చెద'నని వెడలిపోయినాడు.

వర్షమారంభమైనది. మేఘములురుమసాగినవి. ఆయువిరళ వృష్టి పాతశబ్దమునాలకించుచు, దయ్యములమధ్యనున్నట్లు భయకంపి తాత్ముడై బాలకునివలె నేడ్చినాడు తనమందిర మాతనికి మృత్యు మందిరము వలెదోచినది.

---

# ముప్పదియెనిమిదవ ప్రకరణము

## పలాయనము

తాను మూర్ఛపోయినంతమాత్రము జ్ఞాపకమున్నది శకుంతలకు ఆమెకు స్మృతికల్గినది ప్రక్కపైనుండి లేచి, కూర్చుండినది శిరోవేదన మధికముగనున్నది. వినాయకరావు బందీయై యున్నాడని, వారు వధించుటకుద్యుక్తులై యున్నారని జ్ఞప్తికివచ్చినది. ఆతడేమైపోయినాడో యని యామెహృదయ మాందోళనాయత్తమైనది. ఆతడు తన్ను ప్రేమించినాడు. ఆమె మెల్లగాలేచి తలుపు తెఱువబ్రయత్నించినది. రాలేదు. వెలుపలనెవరో తాళమువైచియుందురని యూహించినది. కిటికీనుండి వెలుపలకుజూచినది. ఎదుటనున్నగదిలో రామనారాయణలాలు-లీలతండ్రి క్రిందపడియున్నాడు. ఏమిచేయుటకునుదోచలేదు. ఇంతలో 'నాన్నా' అని వినిపించినది. ఆమె లీల. ఆవేగముతో కూడిన చిత్తముతో శకుంతల 'లీలా!' యని పిలిచినది.

'ఎవరది? శకుంతలా! అయ్యో! నీవిటనున్నావా?' అని యాగది తాళముచూచి 'యివునేవచ్చెద' నని తండ్రికడకుబోయి యాతనికడనున్న తాళపుజెవినిగొని తలుపులదెఱచినది. 'శకుంతలా! నాతండ్రికిది తెలిపినచో జంపివేయును. వెడలిపొమ్ము' అనినది. ఇరువురును క్రిందకు దిగినారు. సగము తెలివి, సగము మైకములతో లేచి 'ఏదీ ఏదీ' అని యేదియో యోచించుకొనుచు రామనారాయణలాలు క్రిందకు దిగి వారిని వెంబడించినాడు. నీరసముగానున్నను పాటింపక లేని ధైర్యముతో శకుంతల పరుగెత్తసాగినది. కొంతదూరమేగి ఆమె వెనుదిరిగి చూచినది. లీల కానరాలేదు. ఆమె యెచటనో దాగియుండవచ్చునని యెంచినది. ఆమె మఱి నాలుగడుగులిడినది. బీటనుండి తిరిగి

వచ్చుచున్న రక్షకభటుడామె మూర్ఛాగతయై పడిపోవుటచూచి పట్టుకొనినాడు.

ఆమె తెలివొంది, ఉదయమున చూచి 'జనరల్ ఆస్పత్రి'లో శయ్యపై దానున్నట్లు 'నర్సు' వలన తెలిసికొన్నది.

*  *  *  *  *  *

ఉదయమున సిటీపోలీసుస్టేషనులో దనకెదురుగా కూర్చుండి యున్న యిన్ స్పెక్టరు చంద్రమోహానుని చూచి సూపరింటెండెంటు విల్లీ యిట్లనినాడు—

'ఏమి జరిగినది?'

'నా మొగము జరిగినది. ఆస్పత్రిలో మతిచలించిన యాయువతి చెప్పిన వాక్యములను బట్టుకొని తెల్లవారఝామున 5 గంటలకు బయలుదేరి యిప్పటివఱకు దిరిగి తిరిగి వచ్చినాను. వినాయకరావు గారేజీలో బందీయైయున్నాడని చెప్పినది. అతడులేడు. ఏదోగోయి యున్నదని చెప్పినది. ఆగోయి పూడ్చి వేయబడియున్నది. నేను త్రవ్వి కూడ చూచినాను ఆగోతిలో మృతకళేబర మేమియు లేదు.'

'రక్తపుమఱకలో—'

'అవియును లేవు'

'సోయోశా ముఖ్యప్రతినిధి ఈశ్వరలాలు బ్యాంకరనుటకు, దగిన నిదర్శనములు—'

'నేనిపుడే ఆతనిని చూచినాను. సోయోశానే యెఱుగనని యతడు చెప్పినాడు—'

'ఆచైనావా డేట్లున్నాడు—'

'ఫెంగ్ హో—అతడు జీవించును.'

చంద్రమోహన్ తిన్నగా వినాయకరావు కంపెనీ కార్యాలయము నకేగినాడు. లీలను కలిసికొని యతడు 'అమ్మాయీ! నీవు రాత్రి యెన్నిగంటలకు దిరిగి వెళ్ళినావు?' అని ప్రశ్నించినాడు—

'పండ్రెండు గంటలకు—'

'శకుంతలను జూచినావా?'

'లేదు. ఆమె నన్ను కలిసికొంటినని యొకవేళ చెప్పినెడల నది యసత్యమని విశ్వసింపగోరెదను.'

'వినాయకరావు మీగారేజీ (మోటారుపెట్టె) లో నుండెనని తెలియునా?'

వినాయకరావా? నాకు దెలియదు.'

ఆమె యిట్లు చంద్రమోహన్‌తో నసత్యము చెప్పుటకు హేతువు లేకపోలేదు. ఆమె ఆఫీసుకు వచ్చుసరికి యిన్‌స్పెక్టరుతో నిట్లు సమాధానములు చెప్పవలయునని లేనియెడల ప్రమాదము సంభవించునని యొక చిన్న చీటీపై వ్రాయబడియున్నది. ఆమె 'శకుంతల యెచటనున్న'దని ప్రశ్నింప యిన్‌స్పెక్టరు 'ఆస్పత్రిలో' ననినాడు—

ఇంతలో శకుంతల వచ్చినది. నాశ్చర్యముగ చంద్రమోహన్ 'ఆస్పత్రినుండి యప్పుడే యెందులకువచ్చినా?'నవ యడిగినాడు.

'రావలసిన యవసరముండి—'

'నీవు చెప్పినట్లు రామనారాయణలాలును గారేజీలో చూచి నాడు. వయినము లేదు గోయియును లేదు.'

'ఏమో నాకేమియు దెలియదు. నేను చూచినది చెప్పినాను, నీకేమియు నగపడలేదనినచో నందులకు నేను బాధ్యురాలనుకాను.'

'వినాయకరావు లేడా'

"లేదు" అని యామె యాతని గదితలుపు దెఱచినది. అతని టేబిలు పైనున్న నోటుబుక్కునుజూచి 'ఇది నెటువాచరుకడ నుండును. ఎవ్వరైన వచ్చియున్నచో నతడా వయినము వ్రాయు'నని పలికి యామె చూచినది.

'సాయంకాల మైదుగంటల యేబదినిమిషములకు ఈశ్వరలాలు బ్యాంకరు వచ్చినాడా?'

ఆమె యాశ్చర్యచకితయైనది—చంద్రమోహ నిట్లనినాడు.

'ఏమీ? ఉదయముననే నీశ్వరలాలును కలిసికొన్నాను. బ్యాంకునుండి అయిదుగంటలకు దిరిగివచ్చినపిదప తానెచ్చటికి బోలే దని నాతో చెప్పినాడు.'

ఇట్లని యత డాసమాచారమును సూపర్నెంటువిల్లీకి టెలిఫోను చేసినాడు. శకుంతల తనగదిలో గూర్చుండినది. ఆమెచిత్తము వినా యకరావుయందే లగ్నమైనది. అతనిగదిలోనిగంట మ్రోగునేమో యని యెంతో ఆశించినది. తుదకు వాడు తప్పించుకొనిపోయి యుండు నని నిర్ధరించుకొని ఆస్పత్రికిబోయి ఫెంగ్ హోను కలిసికొనినది—

'శకుంతలా! వినాయకరావు జాడ తెలియలేదా?'

'లేదు—'

'ఈశ్వరలాలుకు దెలియును. అతడే సోమోకాముఖ్యప్రతినిధి' మహాప్రమాదకరమయిన స్వభావమతనిది. ఆఫీసు వ్యవహారములు నీవే చూడుము. వినాయకరా వింటికిపోయి 'ఛాంగ్' నిటకు బంప గోరెదను.'

ఆమె బ్రూక్ వీధిలోనికి బోయి ఛాంగ్ నాస్పత్రికి బంపి నేషనల్ బ్యాంకుదగ్గఱకు వెళ్ళినది. కొన్నివందలమంది గుమిగూడి యున్నారు ఎవరో యిట్లనుట నామె వినినది—

'బ్యాంకు దివాలాయై పోలిసిట్లచేతులలో బడినది. దొరకి నంత ధనము చేజిక్కించుకొని ఈశ్వరలాలు నేటియుదయమున విమానము నెక్కి యెటకో పలాయన మొనరించినాడు.'

గోడమీద 'పేమెంట్లు తాత్కాలికముగ నిలుపుచేయబడినవి. వైనము తెలియగోరువాడు 'స్లేన్ అండ్ పాల్ పోలిసిటర్లు'ను కలిసి కొనవలయు' నని వ్రాయబడియున్న కాగితము నామె చదివి వెడలి పోయినది.

---

## ముప్పదితొమ్మిదవ ప్రకరణము

రామనారాయణలాలు మరణము

'నేషనల్ బ్యాంకు మూయబడినదట. వెళ్ళి, అది యేమో తెలిసికొనిర' మ్మని సూపరింటెండెంటు విల్లీ చంద్రమోహన్‌ను బంపి, ఈశ్వరలాలు వర్ణమును అన్ని పోలీసుస్టేషనులకు, విమానాశ్రయము లకు బంపి, అరెస్టు చేయుమని కబురుచేసినాడు. వినాయకరావు ఈశ్వరలాలును గూర్చి యంతకుమున్నే రిపోర్టుచేసి యుండుటచే, సూపరింటెండెంటు అరెస్టువారంటు నీశ్వరలాలు పేర జారీచేసినాడు. డాక్టరును కలిసికొని రమ్మనికూడ చెప్పియుండుటచే యిన్‌స్పెక్టరు చంద్రమోహన్ బ్యాంకునుండి డాక్టరు నవజీన్ మెహతా యింటికి బోయి, తలుపు దట్టినాడు నౌకరు వచ్చి తలుపు తెరచి 'అయ్యగా రిపుడే వచ్చెదరు. దుస్తులు ధరించుచున్నా' రనినాడు. చంద్రమోహన్ కుర్చీలోనున్న నవజీవన్ మెహతా కోటును చూచినాడు. త్వరితముగ నతడాకోటు జేబులను వెదకినాడు. ఆతని కేమియు గాన్పించలేదుగాని,

కోటు చేతుల దగ్గర రక్తపు మచ్చలు—అతని జోడుపైన రక్తపు జుక్కలు చూచినాడు. ఇంతలో నవజీవన్ మెహతావచ్చినాడు—ఇన్‌స్పెక్టరిట్లు ప్రశ్నించినాడు.

'ఈశ్వరలాలు బ్యాంకరు మాయమైపోయినాడు అతనిని గూర్చి నీకేమైన దెలియునా? వినాయకరావు కూడ కాన్పించుట లేదు. అతనినిగూర్చి—'

'నాకు యిరువురిని గూర్చియు దెలియదు'

'ఆకోటుపైనున్న రక్తపు మరకల యర్థమేమి?

'రాత్రి ఫెంగ్‌హో నెవరో పొడిచినారు. అతని నాస్పత్రికి బంపుటకు పైకెత్తుటలోనైనవి'

'విల్లిపరేలు పోలీసులుకదా, ఆచైనావాని నాస్పత్రికి బంపినది. వారిరిపోర్టులో నీవిషయము లేదేమి ?

'ఏమో, ఆప్రతిష్టయంతయుఁ దామే పొందవలెననియాశించి, యారక్షకభటులట్లు చెప్పియుందురు. ఆరక్షకభటుని నెంబరు 810 నేనడిగినాను.'

అటనుండి వెడలిపోయి చంద్రమోహన్ విల్లీపరేలు పోలీసు స్టేషను కాన్‌స్టబిలు 810 నెంబరు వానిని టెలిఫోనులో బిలిచి, 'నవజీవన్ మెహతా రాత్రి నీకు సాయముచేసినాడా? యని యడిగినాడు.

'లే' దని యతడు చెప్పగా, డాక్టరును ఫోనులోబిలిచి, చంద్రమోహన్ డాక్టరు! రాత్రి నీవు లేవట. అబద్ధమాడినావు ఇందుల కేదో కారణముండకపోదు? అనినాడు. ఆతడుపోలీసు స్టేషనుజేరగనే సూపరింటెండెంటు విల్లీ 'చంద్రమోహన్! వెంటనే విల్లీపరేలు పోయి రామనారాయణలాలు నరెస్టుచేయుము. నీకు సాయముగ 1742 నెంబరు కాన్‌స్టబిలును గొనిపొమ్ము' అనినాడు.

లీల తండ్రి యాజ్ఞానుసారము ఆఫీసునుండి మధ్యాహ్నము 2 గంటలకే తిరిగి వచ్చినది. ఆమెను జూచి రమ్ము. నేనిక నిటనుండ రాదు. మదరాసు వెడలిపోయెదను. సామగ్రినంతయు విక్రయించి నేను లేఖవ్రాసినపుడు సొమ్మును బంపు'మని రామనారాయణలాలు చెప్పినాడు.

ఇంతలో నెవరో తలుపుతట్టగా లీల తొంగిచూచిపోలీసు' లని నది. సరే. నేను వంటగదిలో దాగుందును. గ్రామములో లేనని సాయంత్రకాలము వత్తునని చెప్పుమని తండ్రి పలుక. భయకంపితయై, లీల మెల్లగా దలుపు తెఱచి యట్లే చెప్పినది. ఆరక్షకభటు నచటనే యుండ నియమించి 'నేను లోనికేగి చూచివచ్చెద' నని మఱొక మార్గము చంద్రమోహన్ వంటగది ప్రవేశించినాడు.

మరుక్షణమున 'హా' య్మని ప్రేలినది. 'కానిస్టబిల్' అని చంద్రమోహన్ కేకవైచినాడు. లీలయు, రక్షకభటుడును అటకేగి చూచినారు. రామనారాయణలాలు ముద్దవలె బోరగిలబడియున్నా డు. అతనికి రెండడుగులదూరములో రివాల్వరుపడియున్నది. ఫాల భాగమునుండి రక్తము స్రవించుచున్నది.

'ఆత్మహత్య పోలీసులరెస్టుకు భయపడి ఆత్మహత్య చేసికొని నాడు. వెంటనే అతడు పోలీసుకు, డాక్టరుకు, ఢిల్లీకి ఫోనుచేసినాడు. లీల విచారసాగరమున మునిగిపోయినది. డాక్టరువచ్చి 'ఆత్మహత్య' యనియే నిర్ధరించినాడు.

ఈవార్త శకుంతలకు దెలిసినది. వినాయకరా పేమైపోయి నాడో యను నాందోళనమునకుదోడు యీవార్తకూడ ఆమెకు

మఱింత యావేదన గల్గించినది. సాయంకాల మూఁడుగంటల కామె యీవలకురాగా డాక్టరు నవజీవనమెహతా శకుంతలా' యని పిలిచి నాడు. ఆతనియెడ నామెచిత్తమున వైరభావముదయించుటచే నిం చుక విసుగుతో నెందుల కనినది.

'దయయుంచి ఒకసారినామేడలోనికిరమ్ము. నీవు కొలాబా పోనక్కఱలేదు. నీకొఱకు మోడరన్ హోటలుమేడలో నొకగది తీసికొన్నాను. నీసామగ్రి యటకుబంపబడినది. వినాయకరా వెవరో, నేను రత్నలాలుచేసిన యపరాధములు తెలిపెదను. ఆతడు డిటెక్టివు. రంగూనులో అరెస్టయిన చండీదాసను పరిశోధకుడే మహోద్భుత నాటకమాడి వారుసోయోకాను. అతనిప్రధానప్రతినిధి ఈశ్వరలాలు బ్యాంకరును వినాయకరావుగు హడలెత్తించినాడు. ఫెంగ్ హో నా కంతయు జెప్పినాడు. నేషనల్ బ్యాంకు పోలీసులవశము చేసినది వినాయకరావే. నాకేమి కీడుమూడనున్నదో ఒకసారివచ్చి కాఫీ త్రాగిపొమ్ము.'

ఆతనిదీనవదనము నాలోకించి యామె 'నేను 15 నిమిషముల కంటె యెక్కువగా నుండ' ననినది. వారు కారులో నెక్కినారు. 'శకుంతలా! ఈశ్వరలాలు నీకై ఆనాడు కబురంపినాడు. డ్రైవరును గూర్చి అనుమానముగ మాట్లాడినాడు. నిన్నారణ్యావరణాలోనికి గొంపోయి చంపుటయే యతనియుద్దేశము. నీవు వినాయకరావుతో జెప్పినావనగనే యతడు తనయభిప్రాయము మార్చుకొనినాడు. ఫెంగ్ హో నిన్ననుసరించుచునే యున్నాడు'.

ఆమె యోచించుకొన్నది. వినాయకరావే తన కేమాపదయు రాకుండ ఫెంగ్‌హో నంపినాడు తానపహ్యించుకొనిన యతనికి దన పై నెంత ప్రేమ కాదు ప్రిన్సెసువీధిలో నాగినది. ఇరువురు లోన ప్రవేశించినారు.

---

## నలుబదియవ ప్రకరణము

### పర్యవసానము

'చంద్రమోహన్! నీవు అరెస్టుచేయుటకు వెళ్ళినక్షణములోనే రామనారాయణలాలు ఆత్మహత్యచేసికొనినాడు. అతడపరాధి. సందియము లేదు. రాత్రివిల్లీపరేలులోనే శకుంతలయున్న కారునసుసరించి పరుగెత్తిన ఫెంగ్‌హోనెవరో పొడిచినారు. డాక్టరుకూడ సాక్ష్యము. అతడు ఫెంగ్‌హోనుజూచినాడు. వెంటనే శకుంతల నిటకు గొనిరమ్ము [illegible] సూపరింటెండెంటు విల్లీ చెప్పగా ఇన్‌స్పెక్టరు చంద్రమోహన్ కొలాబా బోయి మనోరమాదేవిని కలిసికొనినాడు. 'మోడరన్ హోటలులో నామె యుండు'నని మనోరమాదేవి చెప్పగా నతడు అచ్చటకుబోయినాడు. సామగ్రి యొక్క గదిలో సర్దబడినది ఆమెయింకను రాలేదు. అతడు నవజీవన్ మెహతా సౌధమునకు బోయి తలుపు తట్టినాడు. డాక్టరీవలకు రాగానే చంద్రమోహన్ 'డాక్టర్! శకుంతల కొఱకై ఆఫీసుదగ్గర చాలసేపు వేచియున్నావని తెలిసినది. ఆమె యిపుడెటనున్న?' దని ప్రశ్నించినాడు.

'నాకు దెలియదు. నాతో ఆమె విల్లీపరేలుకు వచ్చి, రామనారాయణలాలు పాదముకడ దిగిపోయినది'

'ఆమె యచ్చట లేదు—'

'మఱి యెచ్చటకరిగినదో నాకు దెలియదు, ఏసినీమాకైన బోయియుండును.'

చంద్రమోహన్ స్టేషనుకుబోయి, విల్లీతో నిదియంతయు జెప్పి 'అయ్యా! డాక్టరు సౌధము సోదాచేయుటకు సెర్చివారంటు జారీచేయ గోరెద' ననగా నతఁడు 'వలదు' అనినాడు.

*   *   *   *   *   *

గదిలో నవజీవన్ మెహతా, శకుంతల కూర్చుండినారు. ఆమె కాఫీ త్రాగినది. 'శకుంతలా! నేను కలకత్తాపోదలచినాను. నిన్నెప్పుడు గాఢముగ ప్రేమించినాను గాని ఆవృత్తాంతము నిక స్మరింకను. మఱచిపోదును నేటికిచటనే యుండుము. మేడమీఁది గదిలో శయనించుము. ప్రమాణముచేసి చెప్పుచున్నాను. నిన్ను తాకను. నీకేమియు నపకృతిసలుప' నని, ఆమె చేయిపట్టుకొని మేడమీఁదికి గొంపోయి, యొకగది తలుపు తెఱచి, లోనికి ద్రోసి 'నిన్నెవరు కోరుచున్నారో—ఆత డింమున్నా' డని తలుపు బంధించినాడు. అంధకారబంధురమైన యాగదిలోని యతడు స్విచ్ నొక్కినంతనే కాంతి వంతమైనది. ఆమె యెవరిని కలిసికొన్నది?

*   *   *   *   *   *

మఱుచటి దినముదయమున తొమ్మిది గంటలకు నూపరెంటెండెంటు విల్లీ, చంద్రమోహన్, పదిమంది పోలీసులు విల్లీ రేలులోని రామనారాయణలాలు సౌధము పరిపంప బోయినారు. చంద్రమోహనుని సౌధపరిశోధనకంపి, విల్లీగారేజిని చూచినాడు. శకుంతల చెప్పినట్లు తలుపులకుగొలుసుతో బంధిందగిన దగిన రింగులున్నవి. ఇంతలో చంద్రమోహన్ వచ్చినాడు—

'ఏమి విశేషములు?' అని సూపర్నెంటు డిక్లీ ప్రశ్నించినాడు.

'ఏమియును లేవు. ఆతనిమృతకళేబరమున్న గదిలో యీధన మున్న' దని కొన్ని నోట్లకట్టల నాతని చేతికిచ్చినాడు.—

'సరే. ఈగోయి త్రవ్వించి చూచినావా?'

'ఆహా! నిన్నఉదయము చూచినాను. నాకేమియు కనబడలేదు.'

డిక్లీ యిద్దరు పోలీసుల బిలచి, గారేజిమధ్య సిమెంటుతో గప్పబడిన యాగోతిని త్రవ్వించినాడు. అందులో నొక శవమున్నది. ఆమృతకళేబరమును వారీవలకు లాగినారు. డిక్లీ 'ఈశవమెవరిది?' దనినాడు. చంద్రమోహన్ నిశ్శాంతుడైనాడు.

'అది ఈశ్వరలాలు బ్యాంకరుది' అని యొక క్రొత్తకంఠము వినిపించినది. వారందఱు తిరిగి చూచినారు. వినాయకరావు!

'అతడు నన్ను వధింప బోవ, నేను శక్తికొలది తన్నితిని. అతడు నాతో పోరాటములో దలక్రిందుగా నాగోతిలో బడినాడు. ఆగోతిని రామనారాయణలాలు పూడ్చినాడు.'

'వినాయకరావు! నీపై హత్యాపరాధము నారోపించుచున్నా' నని చంద్రమోహన్ పలుక వినాయకరావు 'సరే. ముందుగా ప్రేమచంద్ జివాజీ! నిన్నరెస్టుచేయుచున్నా'నని, రివాల్వరుతో బెదరింప, డిక్లీ వచ్చి, చంద్రమోహన్ చేతులకు సంకెళ్ళు తగిలించినాడు.'

'చంద్రమోహన్! నీవే ప్రేమచంద్ జీవాజీవై యింతింతన రాని దారుణకృత్యముల జేసినావు రత్నలాలును చంపినావు రామనారాయణలాలును కూడ చంపినదినీవే. అందుచేతనే రక్షకభటుని అట నుండ నియమించినావు మత్తుమందుల వ్యాపారములో ఈశ్వరలాలు బ్యాంకరు నకు దోడ్పడినావు సోయోకా ప్రతినిధులలో నొకడవు

నేటితో నీదురంతకృత్యములు ముగిసిన'వని వినాయకరావు పలికినాడు విల్లీ ఆజ్ఞానుసారము చంద్రమోహన్ జేబు పరిశోధింపబడినవి. ఒక గడ్డము దొరకినది. పోలీసులు ఆతనిని కారాగృహమునకు గొంపోయి నారు. వినాయకరావు విల్లీతో నిట్లనినాడు.

'రాత్రి తోటలోనుండి యీవలకురాగానే నవజీవన్ మెహతా కాన్పించి, తనయింటికి గొంపోయి, గాయములకు గట్టుగట్టినాడు అతనికి శిక్షతగునని యాశ. ఆరాత్రి రత్నలాలును పొడిచినది చంద్ర మోహనే. అతడే అతని కడనున్నాడు. శకుంతల ఫెంగ్ హోయుండుట చూచి హడలిపోయినాడు అతడే నాఆఫీసులో నాలుగు కొకెయిను ప్యాకెట్లు నుంచినాడు. నేనే ఆగోతిలోనుందునని చంద్రమోహన్ తలంపుగాని ఈశ్వరలాలుండుట చూచి, నిశ్చేష్టుడై పోయినాడు విల్లీ! కాటినెరిటల్ బ్యాంకులో నయిదులక్షల రూప్యములను చంద్రమో హన్ దాచుకొనినాడు. ఆతని యింటిలో నున్న సూట్ కేసును దయ యుంచి, నాకిమ్ము. అది రత్నలాలు, డాక్టరు మెహతాల సంపాదన. అతడు నిర్దోషి, ఆతనిని బంధింపవల'దని, చంద్రమోహన్ యింటికి బోయి, శకుంతల గదినుండి ధనములో నిండియున్న యాసూట్ కేసు నాఫీసునకు గొంపోయినాడు.

అతడు మహానందభరితాత్ముడై యున్నాడు. తానిక డిటెక్టివు పనిచేయలేనని వాణిజ్యము చేసికొందునని విల్లీకి ఫోనులో జెప్పినా డతడు నవజీవన్ మెహతావచ్చి తనకార్డునంపినాడు. లోనికి బిలిపించి వినాయకరావు 'మిష్టర్! కూర్చుండు'మని యొకచిన్నసూట్ కేసునిచ్చి నాడు. అందులో మూడులక్షలరూపాయలున్నవి.

'వానితో సుఖజీవనముచేయుము. మత్తుమందుల వ్యాపారము మానుము. నీమీద కేసు లేకుండచేయుదు'నని వినాయకరావు పలుక

'సరే' యని యంగీకరించి, యాత డానందబాష్పాకుల నయనుడై వెడలిపోయినాడు.

*   *   *   *   *

చంద్రమోహన్ జేబులో 'స్లీపింగ్' బిళ్ళలున్నవని, రెండు బిళ్ళలను మ్రింగి యతడు చనిపోయినాడని విల్లి వినాయకరావుకు ఫోను చేసినాడు.

*   *   *   *   *

గంటమ్రోగినది. ఆనందము, ఆవేగములతో గూడిన చిత్తముతో శకుంతలనో బుజాల్లు తీసికొని, వినాయకరావుగదిలోని కేగినది. ఆమె హృదయము తటతట కొట్టుకొనుచున్నది. అతని టేబిలుమీద సుమారు మూడులక్షల రూపాయల నోట్లున్నవి.

'శకుంతలా! రత్నలాలు సంపాదించిన అయిదులక్షల డెబ్బదియేడువేల రూపాయలలోను సగము నవజీవన్ మొహతా కిచ్చినాను, ఈ మూడులక్షలు నీవి.'

'ఇంకేమి? ఆరూప్యములు నాకడ నెందులకు? మీదగ్గఱనే యుంచుడు. ఇంకేమైన కావలయునా?'

'ఒక ముద్దు—శకుంతలా ఒక్కముద్దిమ్ము' అని అతడు లేచి వచ్చి శకుంతలను ముద్దిడుకొనినాడు.

'బి. ఏ. ప్యాసయినావు. విద్యావతివి విశేషించి మూడులక్షల రూపాయల కధికారిణివి—'

'అన్నిటిని మించి—'

'నాహృదయేశ్వరివి' అని వినాయకరావు శకుంతల నాలింగన మొనరించుకొని యిట్లనినాడు.

పంచాయితీ ముగియుసరికి రెండు మూడు దినములగును. మన వివాహము 10 వ తేదీని 15 వ తేదీని మనము డార్జిలింగు, సిమ్లా, కలకత్తా మున్నగు నగరముల దర్శించి వచ్చుటకు బయలు దేఱుదము.'

శకుంతల యానందమునకు మేర లేదు.

స మా ప్త ము

# జ్యోతిష గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| జ్యోతిష ప్రథమబోధిని | | 0 | 8 |
| జాతకమార్తాండము | 1 వ భా॥ | 2 | 0 |
| డిటో | 2 వ భా॥ | 2 | 0 |
| డిటో | 3 వ భా॥ | 2 | 0 |
| జ్యోతిష రహస్యము | 1 వ భా॥ | 2 | 0 |
| డిటో | 2 వ భా॥ | 2 | 0 |
| జ్యోతిష విద్యాప్రకాశిక | | | |
| సంజ్ఞాధ్యాయము | 1 వ భా॥ | 1 | 0 |
| గణితాధ్యాయము | 2 వ భా॥ | 1 | 0 |
| భావఫలాధ్యాయము | 3 వ భా॥ | 3 | 0 |
| ద్వాదశభావఫలము | 4 వ భా॥ | 3 | 0 |
| అదృష్టదీపిక | | 0 | 10 |
| హస్తసాముద్రికము | | 0 | 6 |
| జ్యోతిష ఫలప్రదర్శిని | | 0 | 10 |
| జాతక నారాయణీయము | | 1 | 8 |
| స్వప్నఫలదీపిక | | 0 | 8 |
| సకలసమస్తగుణ అదృష్టఫలదీపిక | | 0 | 12 |
| గౌతమసంహిత | | 0 | 8 |
| వాంఛానాదీయము | | 0 | 8 |
| కోడిపుంజుల శాస్త్రము | | 0 | 6 |
| అంగసాముద్రికము | | 0 | 8 |
| జాతకదర్పణము | | 0 | 8 |
| జాతకపారిజాతము | | 0 | 8 |
| జాతకరాజీయము | | 1 | 0 |
| చేలావని (కలిగాంగ సహస్తి) | | 0 | 6 |
| కాలచక్రము (చేలావని ఖండన) | | 0 | 6 |
| ప్రపంచ జ్యోతిషము | | 0 | 4 |
| జ్యోతిషఫలగ్రంథము | | 0 | 4 |
| శకునశాస్త్రము | | 0 | 12 |
| పంచపక్షిప్రశ్నశాస్త్రము | | | |
| కేరళప్రశ్నశాస్త్రము | | | |
| ఉత్తమప్రశ్నశాస్త్రము | | 1 | 0 |

| | | | |
|---|---|---|---|
| స్త్రీజాతకము | | 0 | 12 |
| యవనజాతకము | | 0 | 8 |
| జ్యోతిషార్ణవ నవనీతము | | 1 | 8 |
| దైవజ్ఞ కర్ణామృతము | | 2 | 0 |
| దశాభుక్తిఫలచంద్రిక అను | | | |
| వృద్ధపారాశరి | | 1 | [illegible] |
| పుట్టుమచ్చలశాస్త్రము | | 0 | 8 |
| జాతకచంద్రిక గోపాలరత్నాకరం | | 0 | 8 |
| నవగ్రహ చింతామణి | | 0 | 4 |
| స్త్రీఋతుశాస్త్రము అను రజ | | | |
| స్వలాజాతకము | | 0 | 8 |
| మూలస్తంభము (జైనగ్రంథము) | | 0 | 8 |
| రత్నపరీక్ష | | 0 | 6 |
| గర్గసంహిత | | 0 | 4 |
| జనన నిమిత్తములు | | 1 | 0 |
| అనుభవజాతకతరంగిణి | | 0 | 8 |
| పూర్వపారాశరి | | 0 | 8 |
| బృహత్పారాశరసంహిత | | 0 | 4 |
| ఆంధ్రజాతకతత్త్వము సూత్రములు | | | |
| | 1 వ భా॥ | 1 | 8 |
| డిటో | 2 వ భా॥ | 1 | 8 |
| గోచారసంహిత | | 0 | 12 |
| కాలామృతము | | 1 | 0 |
| శిల్పసంగ్రహము | | 0 | 8 |
| ఆయుర్దాయయోగము | | 1 | 0 |
| ముహూర్తదర్పణము | | 1 | 0 |
| రెట్టమతశాస్త్రము 60 సంవత్సరముల | | | |
| పంచాంగము | | 0 | 10 |
| సర్వార్థచింతామణి | | 1 | 0 |
| అష్టకవర్గ | | 0 | 8 |
| జలార్గళశాస్త్రము | | 0 | 6 |
| శ్రీపతి | | 2 | 0 |

శ్రీ సత్యనారాయణ బుక్కు డిపో, రాజమండ్రి.

# న వ ల లు

| | | |
|---|---|---|
| అగ్గిరాముడు | 1 | 0 |
| భయంకరుడు | 1 | 0 |
| రమేశబాబు | 0 | 12 |
| సర్కిల్ రంగనాథం | 1 | 0 |
| శకుంతల బి. ఏ. | 1 | 0 |
| చదువుకున్న భార్య | 1 | 0 |
| నీ నేనా ? | 0 | 12 |
| ఛాందసుడు | 0 | 12 |
| శక్తికుమారి | 1 | 0 |
| పంజాబు మెయిల్ | 1 | 0 |
| కన్నపుదొంగ 1 వ భా॥ | 1 | 0 |
| పగటిచుక్క 2 వ భా॥ | 1 | 0 |
| డిటో 3 వ భా॥ | 1 | 0 |
| రమాసుందరి 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| రక్తవాహిని (అయిదు హత్యలా ?) | 1 | 0 |
| ఇంద్రజాలము | 1 | 0 |
| రాజద్రోహి | 1 | 0 |
| అర్ధరాత్రపువింత (3 హత్యలు) | 1 | 0 |
| దురాశ 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| దొంగలనాయకుడు | 1 | 0 |
| మోహపిశాచము 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| కాలసర్పము 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| విషహృదయము | 1 | 0 |
| వలపులరాణి | 1 | 0 |
| నే నెవరి భార్యను ? | 1 | 4 |

| | | |
|---|---|---|
| నే నెవరి భర్తను ? | 1 | 4 |
| వ్యామోహము | 1 | 0 |
| జీవనప్రభాతము(రఘునాథజీ) | 1 | 8 |
| జీవనసంధ్య (తేజసింగు) | 1 | 8 |
| వాడే వీడు 1 వ భా॥ | 1 | 8 |
| నేనే 2 వ భా॥ | 1 | 8 |
| కాలూరాయి 3 వ భా॥ | 1 | 8 |
| ధర్మరాజు | 1 | 0 |
| అహల్యాబాయి | 1 | 0 |
| రాజరత్నం | 1 | 0 |
| కృష్ణవేణి | 0 | 12 |
| ప్రేమలత | 1 | 0 |
| కర్పూరమంజరి 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| రామచంద్రవిజయము | 1 | 0 |
| సౌందర్యతిలక | 1 | 8 |
| వినోదములు 1 వ భా॥ | 0 | 12 |
| డిటో 2 వ భా॥ | 0 | 12 |
| Tales of Rajasthan అను | | |
| రాజస్థానకథావళి 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| మణిమంజరి | 0 | 6 |
| సువర్ణగుప్తుడు | 0 | 6 |
| చమత్కారమంజరి 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| Lives of Great men | | |
| మహాపురుషుల జీవిత చరిత్రలు | | |
| 1 వ భా॥ | 1 | 0 |
| 2 వ భా॥ | 1 | 0 |
| 3 వ భా॥ | 1 | 0 |